1958 వ సం॥ నాటకకళాపరిషత్తు (గుడివాడ) వారు
ఏకపాత్రాభినయము పోటీకి నిర్ణయించిన మయసభ
దుర్యోధనస్వగతవాక్యములతో కూడిన

---

# ద్రౌపదీమానసంరక్షణము



గ్రంథకర్త :

మక్కపాటి వేంకటరత్నం

# ప్రకటన



ఈ నాటకమును నాచే వ్రాతమూలమైన యధికారమును పొందనిదే సొంతముగాగానీ కొంతభాగమునుగాని ప్రదర్శించుటకును, భాషాంతరీకరణ మొనరించుటకును, గ్రామఫోనువగైరా రికార్డు చేయుటకును, ముద్రించుటకును వగైరా ఏమిచేయుటకును ఎవరికిని అధికారము లేదు. ఆలా స్వతంత్రించిన యెడ్ల నే దెచ్చు సివిల్ క్రిమినల్ చర్యలకుఁ బాత్రులై కోరిన డామేజీలు సైత మిచ్చుకొనవలసియుందురు.

ఇట్లు

గ్రంథకర్త.

# ద్రౌపదీ మానసంరక్షణము

ద్వితీయ ముద్రణము

కర్త:

మక్కపాటి వేంకటరత్నం



వెల రు. 2

# పీఠిక



ఇతివృత్తము మహాభారతసభాపర్వములోనిది. ద్రౌపదీ వస్త్రాపహరణ మని ప్రచారములో నున్నది. నిజమునకు వస్త్రాపహరణము జరుగలేదు. కావుననే యీ నాటకమునకు ద్రౌపదీ మానసంరక్షణము అని నామకరణము చేయఁబడియె. ఔచితీ నిర్వహణార్థము ముఖ్యకథాభాగమునకు భంగము లేకుండ నందందు కొన్ని మార్పులు గావింపఁబడినవి. పండితకవి ప్రకాండులు, నాటకకళాభిజ్ఞులు, రసికవతంసులు నగు పెద్దలు కొంద ఱా నా మార్పులు పాత్రౌచితికిని రసపోషణమున కును అత్యంత మవసర మని తమ యభిప్రాయముల నొసంగి యున్నారు. పరప్రత్యయనేయబుద్ధులకుఁగాక ప్రాజ్ఞు లగు పాఠకుల కా యభిప్రాయములతో పనిలే దని వానినెల్లను దుద్ధరింప మానితిని. ముద్రణావసరమున నేను సమక్షమున లేనికారణమున విశేషబాధాకరములుగాని స్వల్పపు టచ్చుతప్పు లందందు నిలిచిపోయినవి. ప్రాజ్ఞు లగు పాఠకుల కవి క్షంతవ్యములు కాకపో వని తలంతును. ఈ ముద్రణా కార్యమునకు నాకొఱ కయి శ్రమకోర్చి శ్రద్ధవహించిన బ్రహ్మశ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికి గృతజ్ఞుఁడను.

ఇంతకుము న్నెన్నఁడును వారికిని నాకును బరిచయము లేకున్నను మాతృభాషాభిమానులును రసికవతంసులును సౌమ్యులు, సంపన్నులును ఉప్పలూరుగ్రామవాసులు నగు

**మహారాజశ్రీ చలసాని వేంకట సుబ్బయ్యగారు**

యాదృచ్ఛికముగ నా కవనమును విని యానందించి యీ గ్రంథముద్రణాభృతిని భరించి తమకుఁగల సహజౌదార్యమును వెల్లడించి భారతీకృపాకటాక్షమునకు పాత్రు లైరి. ఇట్టి సత్కృతులయం దితోధికాదరాభిమానములు జూపుచు, ప్రాజ్ఞసమర్థ్యాణమునకుఁ బాత్ర మైన శ్రీ వేంకటసుబ్బయ్యగారును వారి వంశమును చిరంబు వర్ధిలునట్లు అనుగ్రహింప సర్వకారణకారణుఁ డగు శ్రీరామచంద్రునిఁ బదింబదిగ వేడువాఁడ.

శ్రీ చలసాని వేంకటసుబ్బయ్యగారికిఁ బ్రియమిత్రుఁడును సద్గ్రామవాస్తవ్యుఁడును నా కాబాల్యస్నేహితుడు, సదాచార సంపన్నుఁడును నీ కార్యసాధకుఁడు నైన బ్రహ్మశ్రీ వుప్పలూరి శ్యామలరావు నాకుఁ జిరస్మరణీయుఁడు.

ఇట్లు
బుధవిధేయుఁడు
మక్కపాటి వేంకటరత్నం.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు

## పురుషులు :

నారదుఁడు
శ్రీకృష్ణుఁడు
ధర్మరాజు
భీముఁడు
అర్జునుఁడు
నకులుఁడు
సహదేవుఁడు
ధృతరాష్ట్రుడు
దుర్యోధనుఁడు
దుశ్శాసనుఁడు
కర్ణుఁడు
సౌబలుఁడు (శకుని)
విదురుఁడు
అశ్వత్థామ
కంచుకి
ప్రాతిగామి
కృపుఁడు (కొందఱు రాజులు, భటులు)

## స్త్రీలు :

సత్యభామ
ద్రౌపది
శారద
వాసంతిక

# ద్రౌపదీమానసంరక్షణము

## నాంది

మోక్షఫలప్రదుండు ఖలపుంజనికర్త నవిక్రమక్రియా,
దక్షుఁడు భూరినైష్ఠికవిధాసముపాసనసక్తసం,
రక్షణతత్పరుండుఁ గ్రతురాజమహోత్కటభారధూర్వహుం,
డక్షయవాంఛితప్రదుఁడు నైన రమాపతి మిమ్ము నోముతన్.

సూత్రధారి ప్రవేశించుచున్నాఁడు.

సూ—(పుష్పములు చల్లి సభ కలయంజూచి) ప్రయోగదర్శ
నోత్సుక మైన పరిషత్తు కాలవిలంబమును సహింపదు.
మారిషా ! మారిషా !

మారి—(త్వరగ ప్రవేశించి) బావగారూ ! ఏమి ఆజ్ఞ?

సూ—నిరంతర నిర్జీవనాటకావలోకనమున వాడి వత్త
యైయున్న మన మనఃకమలములను వికసింపఁజేయ నొక
యుత్తమనాటకము లభించినదయ్యా !

మారి—నామకరణము ?

సూ—ద్రౌపదీమానసంరక్షణము.

మారి—నామకరణము సార్థకము, సమంజసము. బావా !
దానిని రచించిన దెవ్వరు ?

సూ—వినవలతువా ! వినుము.

గీ॥ హారితుఁడు మక్కపాటి మహాన్వవాయ
సంభవుం డగు వేంకటాచలమనీషి
కగ్రసుతుఁడు వివేకి నిత్యమును బుధవి
ధేయుఁ డైన వేంకటరత్న ద్విజవరుండు.

మారి—భావా! అది రసవంతముగ నుండునా?

సూ—తినఁబోవుచు రుచు లడుగు టెందులకు?

మారి—నీమాటలనుబట్టి నాటకము నవలోకింప నిచ్ఛ వొడముచున్నది. ప్రేక్షకుఁడ నయ్యెద.

సూ—రమ్ము. నీయట్టి రసికశిఖామణులుగాక మీరెవ్వరంచలి తత్త్వమును గ్రహింతురు?

మారి—(వినుట నభినయించి) ఆహా! శ్రవణపేయమై మైమరపించు నీ సంగీత మెచ్చటిదో?

సూ—మారిషా!

గీ॥ నారదమహర్షి మహతీనినాదమట్లు
లభినవోజ్జ్వలమై దివ్యమై నితాంత
మాంతరికశక్తి కుత్తేజ మలవరించు
చున్న దీ గాన మఖిలతాపోపశమము.

ఇంకఁ దడయరాదు. రమ్ము. (మారిషుని చేయిపట్టుకొని యల్లే నిష్క్రమించుచున్నాడు)

ఇది నాంది.



# ద్రౌపదీమానసంరక్షణము

## ప్రథమాంకము

స్థలము: ద్వారక - మందిర ప్రాంగణము.

(అంతట కీర్తనఁ బాడుచున్నవాఁడుగా నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నా—(తలయూఁచి) ధర్మం జయతి. లోకకంటకు లగు దుర్మదాంధులు తెగుటయు బిదప భువనంబుల కెల్ల శాంతి చేకూరుటయు నా కానందములు. జరాసంధహతకుఁడు మహాబలసమగ్రుఁడై యెరికి నజేయుఁడై మధ్యమలోకంబున కెల్ల మహోపద్రవంబులఁ గావించు చుండుటం గాంచి వానిం దెగటార్చుటకు అవార్యశౌర్యరసోపేతుండును సింహబలుండును నగు భీముఁడుదక్క నన్యులు సాలరని తత్కార్యసాధనాతత్పరుండ నై యింద్రప్రస్థమున కేగి పాండవుల సందర్శించి వారికి పాండునరపాలుని నరకవేదనావిధానం బెఱింగించి తన్నివారణార్థంబు రాజసూయాధ్వరాచరణంబు కర్తవ్య మనియు నందుల కై జరాసంధవధ మునుమున్న కాఁదగిన పని యనియు బోధించి కార్యోన్ముఖులఁ గావించి వెడలిపోయితిని. అప్పటికి నా యుపాయాంకూర మిప్పటికి ఫలించి జరాసంధహతకుఁడు దెగుటయు పాండవులు సర్వ దిగ్విజయంబు గావించి అధ్వరోద్యోగ ప్రవర్తకు లగుటయు మున్నగు కౌతుకోదంతము నేఁడు తత్కర్మసాక్షి యైన సత్యాప్రియునిచేఁ దెలిసికొంటిని. కృతకృత్యుఁడ నైతి.

(కీర్తనఁ బాడుచు నిష్క్రమించుచున్నాఁడు)

స్థలము : ద్వారక - నగరోద్యానము.
సత్యాద్రౌపదులు ప్రవేశించుచున్నారు.

సత్య—ద్రౌపదీ! విహారాయాసము దీర నొకింత సేపీ నెల రాలతిన్నియపై విశ్రమింతము.

(అచటనున్న అరుగుపై నుభయులును నుపవిష్టులగుదురు.)

ద్రౌ—చిన్నవదినె! నా కింత మర్యాద లెందులకమ్మా?

సత్య—సక్రమముగ మర్యాదలు సలుపవలసినది నీకే మొదలింతవర కొక్కసారి యైనను నిన్ను జూడనైనఁ జూడకున్నను దుదకు మీ యన్నగారును నీవును నొకటగుదురు.

ద్రౌ—చిన్నవదినె! ఒక్కటి యగుటకు రెం డగుటకు మీరు రమ్మనిన వచ్చి పొమ్మనిన పోవలసినదానను. నా దేమున్నదమ్మా? అయినను మీరుచేయు మర్యాదలలో నేలోపము లేదని మనస్ఫూర్తిగ మీకుఁ దోచినపుడు నాకు లోప మెట్లు కలుగును? కాకున్నను నేను మెరమెచ్చుఁ మర్యాదలకు మురియుదానను గాను, లోపములకు విచారించుదానను గాను. కావలసినది పరిపూర్ణప్రేమ, వాత్సల్యము. అట్టి ప్రేమయు వాత్సల్యము మాయన్నగారికి నాయందు గలవని నాకు దృఢముగా దెలియును.

సత్య—నీయందుమాత్రమే పరిపూర్ణప్రేమయు వాత్సల్యమును గలిగియుండెనా మీ యన్నగారు? ఎందులకు?

ద్రౌ—నా కాయనయం దట్టి భక్తివిశ్వాసము లున్నందున నాయందే కాదు. నిష్కలంక భక్తివిశ్వాసపరుల కెవ్వరికైనను నాయన దాసుఁడే.

సత్య—ఇచ్చట నంతమాత్రము భక్తివిశ్వాసములు లేనివా రెవ్వరు? నా కాయనయం దెట్టి భక్తివిశ్వాసము లున్నవో నీ కేమైనఁ దెలియునా?

ద్రౌ—అగును. ఎంత భక్తిప్రపత్తులు లేనిదే త్రిభువన పూజ్యుండును నవాఙ్మానసగోచరప్రభావ విభాసియు నగు నా మహనీయుని నీ వామపాదతాడనముచేఁ బూజించెదవా వదినె!

సత్య—ద్రౌపదీ! నీజ్ఞాన మింతమాత్రమేనా? లోకంబున దంపతు లన్యోన్యానురాగంబున మెలంగునపుఁ డేయువతి నిజపాద సంస్పర్శలేశంబున నాత్మేశునిఁ గృతార్థునిఁ గావింపదు ? ఇదియు నొక దోసమా ? పోని మ్మట్లే యను కొందము. అయినపుడు నన్ను శిక్షింపవలెగదా ? దానికి మూరు మీ యన్న న న్నేల వేడుకొనవలె. పడరాని పాటులు పడి దేవతలతోఁ బోరి యా కల్పతరువును దెచ్చి నా పెరటిచెట్టుగ నేల నాటింపవలె ? దీనినిఁబట్టియైన నాయం దాయన కెట్టి ప్రేమకలదో నా కాయనయం దెట్టి భక్తివిశ్వాసము లున్నవో విశదమగుటలేదా ?

ద్రౌ—(తలయూపుచు) చిన్నవదినె! ఎంత మూఢవిశ్వాస మమ్మా నీది? సంకల్పమాత్రమున సకలదానవులను సంహ రించిన యా పరమపావనమూర్తిని నీమాత్రము కాలి తాపులచే బూజించువా రెవ్వరును లేకనే తన ప్రేమామృ తము నంతయు నీపై గురిపించుట ? అనేకహాయనములు తనపడగపై ధరించుభాగ్య మలవడినను దివ్యమణిప్రభా వము నాగము గ్రహింపఁజాలనియట్లు చిరసాంగత్య మల

వడియుండిననుసీవా మహాత్మ్యమని మహిమము లవంబైనను గ్రహింపనేరకున్నావు. లీలామానుషవిగ్రహుం డగు మా యన్నలీలలు దెలియ నేరితరము? వదినే! తత్వమదికాదు. నీ విశ్వాసపరిపూర్ణతకును గాదు, నీ భక్తిపారవశ్యమున కును గాదు, నీయందాయన ప్రేమ చూపుచున్నట్లు నటించుట. అపరదుర్వాసావతారమ వగు నీ నోటికి వెఱచి (చూచి) అల్లదుగో మా యన్నయే యిటు వచ్చు చున్నాడు.

(కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ద్రౌ—అన్నయ్యా! నమస్కరించుచున్నాను.

(నమస్కరించును)

సత్య—దేవా! అభివాదనములు. (నమస్కరించును)

కృ—అభీష్టసిద్ధియగుగాక. (ద్రౌపదివైపు దిరిగి) అమ్మా! పాంచాలరాజపుత్రీ! ఏమియో రాజకీయ విషయవ్యాలోలత నీవు వచ్చినది మొదలు నీతో కొంచెమునే పైనను ముచ్చటింప నవకాశము దొరకినది కాదు. నీ కిచ్చట సుఖముగా నున్నదా?

ద్రౌ—అన్నా! నిరంతరము భక్తజనవాంఛాపరిపూర్తిదం బగు నీ దయార్ద్రమానసమున మాస్థితి యొక్కింత స్ఫురించినఁ జాలదే? మాకు సౌఖ్యములకుఁ దక్కువ యగునా?

కృ—అమ్మా! నీ వదెనలు నిన్ను యథార్థసంభావనలతో జూచుచున్నారా?

ద్రౌ—వారి ప్రాణములకన్న న న్నెక్కుడుగఁ జూచు చున్నారు.

కృ—సత్యా! ఈయుద్యానవనవిశేషముల నీమెకుం జూపి తివా?

సత్య—చూచి యానందించుటయేకాని దినదినము నూత్న పుష్పఫలాదికములతో శోభించు నీ దివ్యతరులతామహి మానుభవము మా కెక్కడ?

కృ—అటులయిన నేనే తెల్పెదను. అమ్మా! నీ వనేకోద్యా నముల నుపలక్షించినను నింతటి మహామహిమాస్పద వృక్షరాజములఁ జూచియుండవు. నీ కిందలి విశేషములు వేఱువేఱుగఁ దెల్పెదను జూడుము.

* సీ॥ ఒండొరుం బెడఁబాసియుండు దంపతుల కై
క్యము సంఘటించు నీ యామ్రఫలము
సుతుల కై వెతఁజెందు సతుల కిచ్ఛాపూర్తి
సమకూర్పఁజాలు నీ చంపకంబు
ప్రాజ్యసామ్రాజ్య వైభవామోదమున్
జేకూర్పఁజాలు నీ శ్రీఫలంబు
సర్వజగచ్ఛ్లాఘ్య సత్యలోకనివాస
మమరించు నీ ప్రఫుల్లాంబుజంబు
త్రిజగతీస్తుత్య దివ్యకాంతిప్రపూర్ణ
చారురూపప్రదాత్రి యీ జాతిసుమము
సరళవిజ్ఞానదాయి యీ కురువకంబు
రమ్యగుణధాత్రి! పాంచాలరాజపుత్రి.

(*ఒక్కొక వైపుకు చూచుచు ఒక్కొక పాదము పాడవలెను.)

ద్రౌ—అన్నా! ఈ ఫలపుష్పంబు లింతమహిమ కలవియా?

కృ—అగునమ్మా! సోదరీ! నీ కింకొక యపూర్వఫలముం జూపెద నిటురమ్మా (కొండొక నడచి) ఇట్టిది ముల్లోకముల నెచ్చటను లేదు.

గీ॥ జలజదళనేత్ర ఇదియొక సత్ఫలంబు
వీనిఁ జవిఁగొన భక్తుల మానసముల
గూఢ మమలిన మై యొప్పు గాఢభక్తి
వ్యక్త మగు నాజ్యమున శిఖిజ్వాలయట్లు.

ద్రౌ—(సత్యను జూచుచు) చిన్నవదెనె? దీనిమహిమ మెంత యపూర్వ మమ్మా?

సత్య—దేవా! దీనిం జవిఁజూడ నాకుఁ గోరిక వడము చున్నది.

కృ—అభ్యంతరమేమి? దీనిం గోయుట కేదేని కొనిరమ్మా.

(సత్య కత్తికొఱకు లోని కేగుచున్నది. కృష్ణుడు చెట్టునుండి పండును గోయుచున్నాఁడు)

ద్రౌ—అన్నా! దీని మహిమ మెంత యపూర్వమో దీని సువాసనయు నంత యపూర్వముగ నున్నది సుమా!

(సత్య కత్తితో ప్రవేశించుచున్నది.)

సత్య—దేవా! నే గోయుదు నిటు తెండు.

కృ—సతీ! ఏమాత్ర మశ్రద్ధ యైనను సహజకోమలము లగు నీ వ్రేళులు గాయపడి కడుంగడు బాధ కలిగించును.

(సత్యవద్దనుండి కత్తిని తీసికొని పండును జెక్కుచు)

అమ్మా! పాంచాలీ! ప్రపంచము ప్రేమను ప్రతిబింబించు

దర్పణము. ప్రేమ ప్రపంచమున బలురూపముల వ్యక్త మగు చున్నది.

ద్రౌ—అన్నా! వ్యావహారికదశయం దున్న అన్నదమ్ముల ప్రేమ, అక్కచెల్లెండ్ర ప్రేమ, సోదరీ సోదరుల ప్రేమ, భార్యాభర్తల ప్రేమ మొదలగు నిది యంతయు పరిశుద్ధ ప్రేమయేనా?

కృ—కాదు సోదరీ! కాదు. (పండును జెక్కుచు) ఇది యంతయు మమకార మనంబడును. రంగు లన్నియు నశించిన పిమ్మట స్వచ్ఛమగు శ్వేతరేఖ కనంబడున ట్లీ మమకారము లన్నియు నశించిన పిమ్మటఁగాని జీవులకుఁ బరిశుద్ధ ప్రేమానుభవము కలుగనేరదు.

సత్య—అయిన మన మనుభవించు నానందములు పరిశుద్ధ ప్రేమానురూపములు కావందురా?

కృ—అగు నని తలంచుటయే అజ్ఞానము. పరిశుద్ధ ప్రేమ ప్రభావ మనిర్వాచ్యము. అవాఙ్మానసగోచరము. అతి పవిత్రము. అది పై పూతలవంటి చేతలకు లోనగునది కాదు. నిశ్చయభక్తివిశ్వాసములకుఁ బ్రతిఫలరూపమైనది. పరిశుద్ధ ప్రేమతత్త్వము నెఱుంగుట దుర్లభము. అదియే నిర్వికల్పానందము. అదియే దైవము. దానిం బ్రాపించుటయే జన్మమునకు బర్యవసానము. (కృష్ణుని వ్రేలు తెగును) అబ్బా! (వ్రేలిని గట్టిగఁ బట్టుకొనును. రక్తబిందువు పడును.

ద్రౌ—(చూచి) అన్నా! ఇదియేమి?

సత్య—ప్రాణేశ్వరా ! రక్తము వచ్చుచున్నదే! వ్రేలు తెగియెనా యేమి ? (కట్టుకట్టుటకు వస్త్రఖండమునకొఱకు లోని కేగును.)

ద్రౌ—(తన చీరచెఱఁగు చించుచు) నిష్కారణముగ వ్రేలు తెగియెనే! అన్నా ! వ్రే లేదీ? (కట్టునుగట్టుచు) ఇంకను రక్తము వచ్చుచున్నదే ? ఈ కాసారమున నీరు కొని వత్తును. (నిష్క్రమించును).

కృ—ఆహా! పరమభక్తుల భక్తివిశ్వాసము లిట్లే యుండును. నా వ్రేలు తెగిన దనినంతనే ఇంచుకైన సంకోచింపక తన చీరచెఱఁగు చించి నా వ్రేలికిఁ జుట్టెనే – ఈ సుశీల నాకొఱకై తన ప్రాణముల నర్పించుటకును వెనుదీయదు. భక్తపరాధీనుండ నగు నేను మన్నివేశితచిత్త యగు నీ సాధ్వీమతల్లి కహర్నిశములు తోడునీడవలె నుండ వలెను. (తలద్రిప్పుచు) తోడునీడవలెఁగాదు దాస్య మొన రింపవలసి వచ్చినను వెనుదీయరాదు.

ద్రౌ—(దోసిలితోఁ దెచ్చిన నీటితో కట్టును దడపుచు) అన్నా ! ఎట్లున్నది ! బాధ తగ్గినదా ?

కృ—పరమపవిత్రం బగు నీ హస్తస్పర్శవలన నీ యలఁతి బాధ యుపశమించుటలో నాశ్చర్యమేముండునమ్మా! నీ మానస మతినిర్మలము. నీ భక్తిపారతంత్ర్య మద్వితీ యము. అనవరత సంభావనీయము.

సత్య—(గుడ్డపేలికతో ప్రవేశించి కృష్ణుని వ్రేలికట్టు జూచి రిచ్చవడుచున్నది.)

కృ—ప్రాణేశ్వరీ! కొంచెముసేపీ నెలరాతితిన్నియపై విశ్రమింపుము. పాపము నీ వెంతయో శ్రమపడిన ట్లున్నావు.

సత్య—దేవా! మీ కీ క ట్టెవ్వరు కట్టిరి?

కృ—చీరెలపై భక్తి కుదురనివారు.

సత్య—ఏమో! మీ రంతయు వింతగ మాటలాడుచున్నారు.

కృ—క్రొత్తభక్తివిశ్వాసము లుత్పన్నము లగుచున్నపుడు ప్రకృతియే వింతవింత పరిణామముల నొందునుగదా!

సత్య—గాయమునొప్పి తగ్గినదా!

కృ—ఇప్పుడా నీవు వస్త్రమున కై చనుటయు నా గాయము నొప్పి తగ్గుటయు రెండును నేకముహూర్తమున జరిగినవి. ఇప్పటి కైనను ద్రౌపదికి నాయెం దెట్టి భక్తికలదో తెలిసినదా?

సత్య—మే మనుకొనిన విషయము ద్రౌపది మీతో చెప్పినదా యేమి?

కృ—ఎంత యజ్ఞానము! గిరిగుహాంతరములగాని సముద్రగర్భమునగాని మరుభూమియందుగాని జీవు లెప్పు డే కార్యము నాచరించినను విశ్వమయుం డనవరతము దన సహస్రనేత్రములతోఁ బరికించుచుండును.

ద్రౌ—అన్నా! నీ మహిమ వర్ణనాతీతము. గర్వితమతులు సర్వసాక్షి వగు నీమహిమమును గ్రహింపనేరక తుచ్ఛంబు లగు నైహికసౌఖ్యంబులకే మురిసి చెడుచుందురు.

(ప్రతీహారి ప్రవేశించుచున్నాడు)

ప్రతీ—దేవా! జోహారు. ఇంద్రప్రస్థమునుండి వార్తాహరుఁడు చనుదెంచి దేవరదర్శనమున కెదురు చూచుచున్నాఁడు.

కృ—ఇంద్రప్రస్థమునుండియా? ఆవశ్యము ప్రవేశపెట్టుము.

ప్రతీ—దేవరయాజ్ఞ. (నిష్క్రమించుచున్నాఁడు)

ద్రౌ—(వామనేత్రస్పందము నభినయించి) అన్నా! వామ నేత్రము స్పందించుచున్నది.

కృ—మూర్ధాభిషిక్తురాలవు కాఁబోవుచున్నావుకదా?

(వార్తాహరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వార్తా—దేవా! జోహారు.

కృ—ఏమోయీ! ఇంద్రప్రస్థమున నందరకుఁ గుశలమా!

వార్తా—చిత్తము. మహాప్రభూ! మామహారాజుగారు తమ కీ జాబును బంపియున్నారు. (ఇచ్చును)

కృ—(తీసికొని విప్పిచూచి) అమ్మా పాంచాలీ! మన మను కొనిన విషయమే. బావగారు రాజసూయయాగమునకు ముహూర్తము నిర్ణయించినారు. రాబోవు పూర్ణిమా భానువారముననే.

ద్రౌ—అన్నా! ఇదంతయు నీ కృపావిశేషమేగదా?

కృ—ధర్మపథవర్తుల సంకల్పము లెప్పుడును జయప్రదములే నమ్మా! పోవుదమా?

ద్రౌ—అట్లే. (పోవుచుందురు)

సత్య—(స్వ) ఈ స్వల్పవిషయమునకే యింతచిత్రముగ నటించిన యీ మహనీయుఁడు దురాత్ములగు లోకకంటకులం దునుమాడునపు డెన్నెన్నివిధములఁ జిత్రవిచిత్రముగ నటించునో? కనుకనే ఋషిశ్రేష్ఠులు సైతమీ మహాత్ముని లీల లవాఙ్మానసగోచరములు, అతివిచిత్రములు నని వర్ణించుచుండుట.

(తలయూచి నిష్క్రమించు చున్నది)



# ద్రౌపదీ మానసంరక్షణము

## ద్వితీయాంకము

ఇంద్రప్రస్థము - వీధి

(కీర్తనఁ బాడుచు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నార—ఆనందం. పరమానందం. కృతకృత్యుఁడ నైతిని. ధర్మరక్షణార్థ మితఃపూర్వ మెన్నిపోరాటములలో కల్పించి యానందించితినిగాని యింత మహానంద మెన్నఁడును సమకూరి యుండలేదు. ధర్మజుని రాజసూయసంకల్ప మునఁ దోలుదొ ల్త జరాసంధహాతకుఁ డీలోకంబునకుఁ బాసె. ఇప్పుడు శిశుపాలహాతకుఁడు పెచ్చుపెఱిగిన దుర్మ దాతిరేకంబున అధ్వర సభామధ్యంబున మహోత్పాలం బ్రతారించి తుదకు శ్రీకృష్ణపరమాత్మచే నంతమొందింపఁ బడియె. దుష్టులఁ ద్రుంచి శిష్టులఁ బరిపాలించి లోకము నుద్ధరింప నవతరించిన లీలామానుషవిగ్రహుండగు శ్రీకృష్ణపరమాత్మయొక్క మాహాత్మ్యముం దెలియ నేత న్మాత్రుల కలవియా? ఆహా! ధర్మదేవత యనందగు నీ ధర్మతనయుని వినయసంపద నేమని కొనియాడఁదగును! అధ్వరసభామధ్యంబున సపర్యావిధానంబున నన్నుం బూజించుచు, మహాత్మా! భవద్దయావిశేషంబుననకాదే నే నీ యధ్వరభారమును నిర్వహించి నా జనకునకు

ను_త్తమగతులం గల్పింపఁజాలితి. కావున నీ కౌతుకోదం తము మాతండ్రి కెఱింగింపుఁ డని ప్రార్థించె. నే నిపుడ క_ర్తవ్యంబునకు గడంగెదఁగాక.

( కీ_ర్తనఁబాడుచు నిష్క్రమించును )



స్థలము : మయసభ - దుర్యోధనుడు.

దుర్యో—( కలయంజూచి ఆశ్చర్యానందముతో ) ఔరా ! ఈ రచనాచమత్కృతి ఏమియోగాని ప్రకృతిసౌందర్యము నథఃకరించుచు కురుసార్వభౌముఁడ నైన నా మానస మును సైతమాకర్షించు చున్నదే ! (ప్రక్కలం జూచి) వీరు నా నుడు లాలించియుండరుగదా ! (ఆశ్చర్యముతో) ఏమి, వీరల రూపలావణ్యాతిశయములు అపూర్వములే ! ఈ త్రిజగన్మోహనాకృతు లెవ్వరి వైయుండును? (సమీ పించి) ఓయీ! మీర లెవ్వరు ? (నిదానించి) ఇదియేమి? వీరు ప్రతివచనం బీయరు. (మరల కొంచెము బిగ్గరగ) మీర లెవ్వరు ? ఇచ్చట నుండుటకు గతంబేమి ? (ఊరకుండి) ఏమిది ? (బాగుగ పరీక్షించి) నే నెంత భ్రమపడితిని ? నిమేషత్వమే లేదు. ఇవి సాలభంజికలు. (ఆశ్చర్యముతో) ఏమి యీ విచిత్రకల్పన! (తలయూచి) మయుని లోకో_త్తర కళాకౌశలము. (ఇంకొక వైపునఁ జూచి) సభాభవనమున నుద్యానవనమా ! ఎంత రమణీ యముగ నున్నది. (చూచుచు) వివిధఫలభరానతశాఖా శిఖాతరువరవిరాజితంబు. రాజిత తరుస్కంధసమాశ్రిత దివ్యసురభిళ పుష్పవల్లీమతల్లికా సంభాసురంబు. భాసుర

పుష్పగుచ్ఛ స్రవన్మధుర మధురసాస్వాదనార్థ సంభ్రమ దభ్రిమర కోమల ఝుంకార ని నా ద మే దు రం బు. మేదుర మధుకరఘనఘనాఘనశంకానర్తనక్రీడాభిరామ మయూరవారవిస్తృత కలాప కలాపరమణీయంబు. రమణీయ కోమలకలాపకలాపలాప మంజులదోహదధూప ధూమాంకురసంకీర్ణంబు. సంకీర్ణనికుంజపుంజసుందరంబు. ఆహా! ఈ యారామసౌకుమార్యం బత్యంత మనోహరంబు. దినదినానేకనూత్నారామరంజ్యమారాకౌరవవంశ వర్ధన మనఃప్రమోదావహం బగు నీ నిష్కుటంబు తక్కొరుల కద్భుతదర్శనీయం బగుట నిర్వివాదాంశము. కావననే "మయసభ", "మయసభ" అని సామాన్యజనుఁడు మొదలు రాజకంఠీరవునిపర్యంత మేకగ్రీవముగ దీ ని ని గురించి వర్ణించుట.

(తలయూచి) ఇందలి ఫలకుసుమజాలములును మహానందమును గల్పించుచున్నవి. (నడువ నుంకించి చూచి) కాసారమా ఇది? ఉండి లేనట్లును లేక యుండినట్లును గనంబడు చున్నది. (బాగుగఁ జూచి) జలాశయమే కాకున్న నీ బిససూత్రములు నీ శతపత్రాదికము లెట్లుండును. (తల పంకించి) సంస్పర్శమాత్ర నూత్న చైతన్య ప్రసాదక శీతల వి మ ల మధువారిపూరసంపూర్ణంబు. మందపవనచాలనోద్ధూత కల్లోల తరంగమాలికా పరస్పరసంఘట్టన జాయమానమృదులధ్వాన విస్తారాతిశ్రావ్యంబు. కమల కోకనదాది నానావిధజలకుసుమరాగారుణితదరీభాగంబు. ఆలోలబాలశైవాలజాల లాలితజంగమోద్యానశంకా

వహంబు. గ్రీవాలంకృతబిససూత్రపాళికాసందీపితహంసహం
సీగణవిభూషితంబు. వర్ణనాతీతంబు. చూడంజూడ నియ్యది
అపూర్వరమణీ రమణీయాకృతిం దలపించుచున్నది.

(తలయూఁచుచు)

సీ॥ రమణీయ కమలపత్రవ్రాతసముదీర్ణ
హరితచేలాంచలస్ఫురణతోడ
లలిత నీలోత్పలోచ్చలితదళానీక
చారుభాస్వద్దృగంచలముతోడ
మలయానిలోద్ధూతజలజపాంసు సుగంధ
కమనీయ సౌరభాకలనతోడ
సలిలితామేయ నిష్యంద శీతలబిందు
సందోహ హర్ష బాష్పములతోడ
విమల శైవలకబరికాభములతోడ
లాలిత మృణాళబాహువల్లరులతోడ
నిరుపమవిలాస సత్కళాన్విత మగుచు
శ్రీల నొప్పారు నీ సరసీలలామ.

ఇందలి మధువారిపూరము నించుకఁ గ్రోలి యీ పరిసర
మున నొక్కింత విశ్రమించెదఁగాక. (అడుగువెట్ట వట్టినేల
యగును.) (యోజించి) ఇదియేమి ? ఇచ్చటి ప్రకృతియే
నన్ను బరిహసించుచున్నట్లున్నదే. ఇది యెంత మాయగ
నున్నది ?

సీ॥ భావగాంభీర్యస్వభావవాసన లేక
కేవల కల్పనాకృతి వహించి
అవలోకమాత్రజీవానిలహరగూఢ
పదనిగూహనవృత్తిఁ బరిఢవిల్లి
భ్రాంతికారణ నిరర్థప్రయుక్తానర్థ
విశ్రమపదశిలావితతి నెనసి
వితతసమాసమహిత భూరిభంగసం
క్షుభిత సత్కవిరాజకోటిఁ దనరి
ఉత్పలాదికవృత్తంబు లుండుకతన
సరస మని యెంచిరా నిది విరస మయ్యొ
వంచ్యమాన నరోత్తరవాంఛితంబు
కాకవి కుకావ్య మీ యంబుజాకరంబు.

ఇది మయుని రచనావిశేషమా? నేను భ్రాంతియుతుండ నైతినా? (వినుట నభినయించి చకితుఁడై) ఎచ్చటిదీ హాసధ్వని? మముగాంచి యెవ్వరును బరిహసించుట లేదుకదా? (కలయంజూచి) ఇచ్చట నెవ్వరును గానరారే! ఈ సవ్వడి యెటనుండి వచ్చె? (ఊరకుండి తల పంకించి తిరస్కారభావముతో) అతులితమాయారచనా సమర్థుఁడైన ఆ మయుం డిట్లు ధ్వనించు యంత్రము నిం దెందైన నిర్మించి యుంచెనేమో? (మరియొకవైపున దృష్టిఁ బరపి) ఆ కన్పడున దేమి? (ఆశ్చర్యముతో) వివిధ మణివికారకుడ్య భాగాంతర్గతద్వారదేశమా?

తత్సువర్ణశాఖాంతరోల్లిఖితాగారుత్మతవల్లీసముల్లసితమా? వల్లీసముల్లసిత సల్లలితపల్లవ సందోహమా? మధ్యేపల్లవ సంపుటాత్యంతభాసుర పుష్పఫల ప్రతానమా? పుష్పఫల మకరందరస సేవనార్థసమాగత షట్పద కీరవారమా?

(యోజించి తలత్రిప్పుచు ఇటునటుం దిరుగుచు)

ఇట్టి త్రిజగన్నుత సభాభవనము పాండవుల యధీనమున నుండుటయా? (తలయూఁచుచు) కాల స్వభావము. నిన్నమొన్నటిదనుక నిలువ నీడలేకుండిన పాండవులు దిగ్విజయ మొనరించి రాజసూయ మహాధ్వర నిర్వహణమున సార్వభౌమపదంబు నలంకరించుటయా? అభిమానధను లగు భూపతు లెల్ల పరిగ్రాహ్యులై వస్తు వాహనాది నానావిధోపాయనముల నర్పించి గౌరవించు టయా? ఏలోకముననో పడియుండిన యా మయహాతక్షుఁడు త్రిలోకాధిక భ్రాజమానం బగు నీ సభాభవనమును నిర్మించి యిచ్చుటయా? పాండవు లన్యజన దుర్నిరీక్షులై విజృంభించుటయా? ఇదంతయుఁ గనులార గాంచుచు సుక్షత్రియవంశసంజాతుఁడగు సుయోధనసార్వభౌముఁడు సహించియుండుటయా? (యోజించి తలపంకించి యీర్ష్యాసూయలతో మొగమున గంటువెట్టుకొని) నా సమక్షమున నూరును బేరును లేని ధర్మజునకు నా సామంతు లెల్ల రుపాయనముల నర్పించి పరస్పర శిరఃకోటీర సంఘర్షణంబున దుల్లిన వజ్రమణిమయూఖం బులు భూపతికి నూత్నశోభ నాపాదించి రత్నగర్భనామము సార్థకపరుప సాష్టాంగదండప్రణామంబుల నాచరిం

చుట నా కవమానముగాదా? దుర్మదంబున ధర్మజుండు యుక్తాయుక్తవిచారవిదూరుం డై సార్వభౌముని సమక్ష మను జ్ఞానమైనను లేక స్వేచ్ఛగ వారిప్రణతులం గై కొను టయా? (యోజించి) యోజించినకొలఁది మనంబునఁ బట్టరాని క్రోధము వెల్లివిరిసి దుర్భరం బగుచున్నది. ఇంక నిచ్చట నిలువఁజాల. పోఁబోవ నది సంవృతద్వారం బగుట కవాటఘటిత శిరస్కుఁ డగును. (తల పట్టుకొని) అబ్బా! (పరహాసధ్వని వినంబడుచున్నది. తలపై చేయి తీసి సవరించుకొని) మరల పరిహాసము. (ధ్వనివచ్చువైపు క్రూరముగఁ జూచుచు, తలయూచుచు) అవరోధజనుల పరిహాసము. (సక్రోధముగఁ దలయూచి పండ్లుకొరుకుచు) పంచభర్తృకా! కానిమ్ము. ఇప్పటి కిది పరిహాసమాత్రమే. కాలాంతరమున ప్రళయభైరవ వికటాట్టహాసవిస్ఫారిత భృకుటీప్రభూత తీవ్రవైశ్వానరజ్వాల—(తల పంకించుచు) తీవ్రవైశ్వానరజ్వాల – (తల పంకించుచు క్రూరదృష్టితో మరియొకవైపుగా నిష్క్రమించుచున్నాఁడు.



స్థలము : ఇంద్రప్రస్థమువీధి

(అంతట పూలబుట్ట చేతఁబట్టుకొని శారద ప్రవేశించుచున్నది)

శార—(ఆకసమువైపు జూచి) ప్రొద్దు క్రుంకపోవుచున్నదే! ముత్తైదువు లందఱు వేచియుందురు కాఁబోలు! సకాల మున కీఁ పుష్పము లందఁజేయమికి ద్రౌపదీదేవి నాపై కోపించునేమో?

(బిరబిర నడచుచుండును. వెనుకనుండి)

శారదా! శారదా! (వెనుకదిరిగి చూచి) ఓహో, వాసంతిక వచ్చుచున్నదే?

వాసం—(ప్రవేశించి) శారదా!

శార—నీ వమ్మగారివద్దకు వచ్చుట లేదేమే?

వాసం—కారణాంతరములచే నే నీ నడుమ వచ్చుటకు వీలు లేకపోయె. విశేషములేమే?

శార—ఏ మున్నవే?

వాసం—దేవి నిష్కారణము మల్లికాకమలికల నంతిపురి నుంచి వెడల నడిపించెనట. అదియేల?

శార—(వెనుదిరిగి) నిష్కారణమేమి? వారుచేసిన యప రాధమో?

వాసం—ఏమిచేసిరి?

శార—అమ్మగారికి సైతము ప్రతిష్ఠ రాఁదగు కార్యమే చేసిరి.

వాసం—అంత ఘోరకార్య మేమిచేసిరే?

శార—దుర్యోధనసార్వభౌముడు మయసభాభవనమున విహ రించుచు నచ్చట రచనావైచిత్రికి భ్రాంతిఁజెంది తబ్బిబ్బు వడుచుండ మన మల్లికాకమలిక లదిగాంచి హాసించుచు నింకేమి విభ్రమముల కీతడు లో నగునో చూత మని అట్టె నిలిచిరట.

వాసం—ఆపిమ్మట—

శార—ఆపిమ్మట నాతఁడు వేరొకచో మూయఁబడిన ద్వారమును విప్పృతంబుగా నెంచి యందు జొఱంబోయిన నా కవాట మాతని శిరస్సునకు గొట్టుకొన నదిగాంచి వారు పట్టలేక పెద్దపెట్టున నవ్విరట.

వాసం—ఎట్లు?

శార—అంత నాతఁడు కుపితుఁడై గ్రుడ్లెఱ్ఱఁజేసి అంతిపురి నైపు క్రూరముగఁ జూచి తలపంకించుచుఁ బండ్లు గొఱుకుచు "పంచభర్తృకా!" కానిమ్ము అని ఇంకేమేమో గొణిగికొనుచు నటనుండి వేఱొకద్వారంబున వెడలి పోయెనట.

వాసం—ఆ. ఏమీ! ఇంత అవివేకపుఁబని చేసిరా.

శార—అవివేకమా! అవివేకమా! ఇవి అంతఃపురమున కెంతటి అప్రతిష్ఠకు హేతువో సుంత యోజింపుము.

వాసం—అయిన నీ వర్తమానము దేవి కెవరు తెలుప సాహసించిరే?

శార—ఎవరో ఏటికి? వారలే. నిజముగ నవ్వినది తామే యైయుండ నాతఁ డది గ్రహింపనేరక వేఱువైపునకు దృష్టిమరల్చి బేల యయ్యె నని మఱింత సంతోషమున దేవి కీవార్త నెఱింగించి మెప్పువడయ నెంచి గంతులు వైచుచు బరువెత్తుచుండిరి. అప్పుడు నే నదాటున నెదురై వారి యాతుర మెఱుంగఁగోరి మల్లికను బిలిచి యడిగితిని.

వాసం—అజ్ఞానమున వా రట్లు చేయఁ దలంచినను దేవి కీవార్త నెఱింగించిన చెట్ట కలుగు నని నీవైన వారింప నైతివా?

శార—ఎట్లు వారింతును? మల్లికచే నేనీ వృత్తాంతమును దెలిసికొనునప్పటికే కమలిక పోయి దేవి కీవార్త నెఱింగించి రోషావేశయైన యామెచే తాపముపడిన శ్రమకుఁదగిన విశ్రాంతిని తీసికొనుటకు శాశ్వతముగ సెలవిప్పించికొని విన్ననైన మొగంబుతో మా కెదురై దేవికి తమపై గలిగిన యాగ్రహమును దెలుప మల్లికయు డిల్లవోయి తమ బ్రదుకు దెరువు పోయినందుల కేడ్చుచుండ నేనైన దేవిం బ్రసన్నురాలిని గావించి వీరికి మరల గతులు గల్పింప యత్నించితినిగాని నా ప్రయత్న మంతయు నిష్ఫలమయ్యె.

వాసం—ఈమాట యాచెవినిఁ యాచెవినిఁబడి మన మహారాజునకు నైతము దెలియకుండునా? తెలిసిన యాతఁ డెంత నొచ్చుకొనునో?

శార—ఏమో: ఇం కేమి పుట్టనున్నవో! మన ప్రభువుచే వీడ్కోలు వడసి దుర్యోధనసార్వభౌముడు హస్తిపురికి వెడలిపోయెనట. (ప్రొద్దుచూచి) వాసంతికా! మాటల సందడి నెంతసేపు నిలిసితివే?

వాసం—నేనును అంతిపురికే వచ్చుచున్నాను పోవుదముపద.

(నిష్క్రమించుచున్నారు.)

# ద్రౌపదీ మానసంరక్షణము

## తృతీయాంకము

### (ప్రథమ రంగము)

స్థలము : హాస్తిపురి - ఆంతరంగికభవనము.

(అంతట క్రోధముగల దీర్ఘనిశ్వాసముతో కొంతసే పిటునటుం దిరిగి కూరుచుండి)

దుర్యో—ఆ బంధకీకృత పరిహాసావమానమునఁ బ్రాణపరిత్యాగ మొనరించుటయా లేక ఆ పరిభవంబునకుఁ దల యొగ్గి జీవించుటయా ? (ఊరకుండి లేచి) సప్తసాగరవేలా వలయితవసుంధరావలయంబున కెల్ల నేకచ్ఛత్రాధిపత్యమును వహించి అప్రతీపప్రతాపమునఁ జండశాసనుం డై యలరారు నాయట్టి రాజన్యచూడామణి యెవ్వఁ డిట్టి హేయ మగు దుర్మరణమున కంగీకరించును ? (కూరుచుండి యోజించి) పోనిమ్ము. ఈ యవమానమును భరింపఁ జాలక దుర్మరణమునకే సాహసింత మన్నను బ్రయోజన మేమి ? (చకితుఁ డై ఆఁ ఏమీ అభిమానధనుం డగు సుయోధన సార్వభౌమునకా అవమానము ? (తలయూఁచుచు) ఆదుర్జాతి శుద్ధాంతమున లజ్జావిహీనతఁ బరిహాసించినఁ బరిహాసించునుగాక. నాయంతటివాని కవమానము తటస్థించునా ? (తిరస్కారభావముతో) మహాగజేంద్రంబు మార్గంబునఁ జనుచుండఁ గుక్క లెన్ని

మొఱఁగుటలేదు? (యోజించి తలఁద్రిప్పుచు) ఊహు. నే నెన్నివిధముల నా యంతరాత్మకు సరిపెట్టుకొన్నను యీ వార్త యెల్లెన లోకంబున వెల్లడి కాకమానదు. నిరర్థకముగ దురర్థ ప్రతిపాదకు లగు లోకు లనేకు లనేక విధంబుల దలంపక మానరు. ఆ పిమ్మట నన్ను సందేహింపక మానరు. సుయోధనసార్వభౌముని జీవితమున నీ కళంకము స్థాన మేర్పఱుకొనక మానదు (తలఁద్రిప్పుచు) అపశయంబున జీవించి యుండుటకంటె మరణంబు సర్వ విధంబుల శ్రేయోదాయకంబు. (కూరుచొని యోజించి) పోనిమ్ము. ప్రాణపరిత్యాగానంతరమున నైన యీ పడి తప్పునా? (తలద్రిప్పుచు) మానినీపరిహాసపాత్రుం డగు మానవపతిచరిత్ర మని రేపటినుండియు నా జీవిత మీ లోకమున నాటకరూపమునఁ బ్రదర్శింపఁబడదా? కావున సర్వవిధంబుల మరణంబు గర్హితంబు. జీవించి యుండుద మన్నఁ బరనారీపరిహాసపంక కళంకిత జీవనుండ నై మని యుండుటయు దుర్భరంబ. ఏమిసేయుదు? (తలఁద్రిప్పుచు) అచేతన మగు భూపరాగమె పాదహతి సైపఁజాలక మానవున మూర్ధ మధిరోహించి తన పగను దీర్చికొనుచుండ సచేతనుఁడ నై సబలుఁడ నై సార్వభౌముఁడ నైన నేను ఒక్క ఆడుది యొనరించిన యవజ్ఞతకు బ్రతీకారము గావించి నా పౌరుషమును స్థిరపఱచుకొనఁజాలనే? (కూరుచుండి యోజించి) కట్టా! నా యవమానముల కన్నిటికిఁ గారణ మైన దా మయసభయేకదా? నా క్రోధమునకు మనికిపట్టైన దా మయసభయేకదా? తుదకు నా జీవిత

మును విషమస్థితి నాక్రమింపఁ జేసినదియు నా మయ
సభయేకదా ? ఏమి కాలపై పరీత్యము ! తొట్టతొలుత
నీ రాజసూయమే లేకుండిన నింత యుట్టిపాటు పుట్టనే
పుట్టదుకదా ? ఔరా ! ధర్మజ రాజసూయము దుర్యోధన
సార్వభౌము నభిమాన పుష్పోపవన నిర్మూలనంబునకు
విషవాయుసదృశం బైనదే ! (క్రోధముతో) దురాత్ములు
యుక్తాయుక్తపరిజ్ఞానవిహీనులు రాజనీతిబాహ్యులు పర
వంచనాసక్తులు నగు ఆ పాండవహతకులు పిలిచినంత నే
నే నేల యా రాజసూయాధ్వరంబున కరుగవలె? పోయితిఁ
బో నా కేల యా మాయమయసభాసందర్శనేచ్ఛ యంకు
రింపవలె? అంకురింపఁ జేబో - నే నేల అందందుఁ దిరుగాడి
అవాచ్యము లగు నవమానములకు లోనుగావలె ? లోనై
తిఁబో- ఆ సమయమున ఆ పాపిష్ఠ నిష్కారణముగ నన్నేల
పరిహసింపవలె. ఈ స్థితిగతులంబట్టిచూడ న న్నా బంధ
కిచే వంచింపఁ జేయుట కై ఆ పాండవహతకు లీ రాజ
సూయవ్యాజంబున న న్నింద్రప్రస్థమునకుఁ బిలిపించినట్లు
తోచుచున్నది. (తలయూఁచి) నిశ్చయముగ నా దురాత్ము
లీ దురుద్యోగ సంగతాత్ములే కానిచో గేవల సభావలో
కన తత్పరుండ నగు నన్ను వా రేల నిరర్థకముగ పరిహ
సింపవలె ? (తలయూఁచుచు) తెలిసినది. ఆ రాజ
[illegible] కపటిలోపాయం బై యుండుట
[illegible] నిస్సంశయము. ఎంత మోసము! ఎంత కౌటి
ల్యము! ఎంత దుండగము! (ఉత్కట క్రోధముతో) ఓరీ !

పాపిష్ఠులారా! పాండుభూపాల గర్భభూతులారా! (తల
యూఁచి యోజించి) ఏమి నా వెఱ్ఱి! ఆభిజాత్యమునందు
దృష్టిసారింపక ఆత్మగౌరవమునందు గురినిల్పక సార్వ
భౌమపదంబు నైనఁ దలంపక నే నెట్టి యవ్యక్తాలోచనం
బునంబడి కొట్టుకొనుచున్నాఁడ? నవఖండ భూమండలా
ధిపమకుటతటఘటిత మణిఘృణినిరంతరనీరాజిత నిజపాద
పంకేరుహుండ నై సింధురాట్చతుష్టయపరివేష్టిత వసుం
ధరాభారధూర్వహుండ నై పరరాజ మదసంహరణభీకర
భుజాబలసమగ్రుండ నై అభిమానధనుండ నై దుర్నిరీ
క్ష్యుండ నై పదునాల్గు భువనంబు లొక్క పెట్టు నెత్తివచ్చిన
నుక్కడంపంజాలు ప్రచండప్రతాపప్రభావిభాసితు లగు
నూర్గురు సోదరుల కగ్రజుండ నై చండతరపరాక్రమో
జ్జ్వల మై, దిగంతవిశ్రాంత సద్యశోవిలసిత మై, అభిమాన
వల్లరీబందీకృత మై, నిష్కలంక మై జగంబునఁ బేరెన్నిక
గన్న సుక్షత్రియవంశంబున జనించి అనేకాక్షౌహిణీ
చమూసమూహంబున కధినాథుండ నగు నాకు యీ
ప్రపంచమున నెయ్యది అసాధ్యము? ఇప్పుడే పోయి
యా దురాత్ములఁ జించిచెండాడెద. ఆపురంబు భస్మీపట
లము గావించెద. ఆపాపిష్ఠ నాపాంచాలి నెంచరాని
మహాపదల ముంచెద. నా మనోవికల్పములకు గారణ
మైన యా మయసభ విధ్వస్త మొనర్చెద. (క్రూరముగఁ
జూచుచు) దురాత్ములారా! పా[illegible]
సుయోధన సార్వభౌముఁ డభిమాన[illegible]
బెందుగుం డనియు, మీఁదుమిక్కిలి మీయట్టి సా[illegible]

మాత్రుల కనేకులకు శాసకుం డనియు నైనఁ దలంపరైతిరే! అప్పుడే దుర్మదాంధత్వము కన్నుల కెగదట్టెనా? అప్పుడే యుక్తాయుక్తజ్ఞానము నశించెనా? అగును, అల్పపుసిరి కన్నులు గాననిచ్చునా? ఎట్టెటులో యొక రాజసూయ మును నిర్వహించితిమికదా యని కన్నును మిన్నును గాన కున్నారే! ఇంతమాత్రమున యింత మిట్టిపాటా! (తల యూఁచుచు) కానిండు. ఈ సుయోధనక్రోధాగ్నికి దూది బుంగలు కాకపోవునా మీ మీ దుర్దాష్ట్యములు? ఈ సుయోధన సార్వభౌమ నీర్ష్యాభూతంబున కాహుతులు గాకపోవునా మీ హృదయపిండంబులు? ఈ దుర్యోధన చక్రవర్తి యీర్ష్యాగ్రహంబునకుఁ బానీయంబులు కాక పోవునా మీమీ కవోష్ణరక్తప్రవాహంబులు? ఈ శౌర్యరాశి దుర్వార శౌర్య చండమార్తాండ తీక్ష్ణకరంబులకుఁ గబ ళంబు గాకపోవునా మీమీ గర్వాంధకారంబు? ఏమి మీ కండక్రొవ్వు! భవన్మనోగత దౌరాత్మ్యవారివాహ విభంజన సమర్థప్రభంజనము కాదా యీ కురురాణ్మణి క్రోధము!

భవద్ధృదయసంవృతగర్వపర్వతోన్మూలన చణవజ్రా యుధంబుగాదా యీచక్రవర్తికార్యము? భవచ్చిత్తాటవీ సంచరద్దురూహామత్తమాతంగ వక్షఃకవాటవిపాటనపాట వోదగ్రసింహకిశోరకరాంచలనఖాంచలంబులుగావా ఈ కురుముఖ్యుని అద్భుతోపాయపరంపరలు? ఓరీ! రాజకుల పాంసనులారా మిమ్ముల నింక యింద్రప్రస్థపురంబున నిలువనిచ్చిన నేను సుయోధనుండనేనా? కట్టుపుట్టముల

సైత మూడలాగించి మిమ్ముల నట్టడవుల గుట్టలపాలు గావించి చెట్టులం బట్టింపకున్న నే రాజరాజునేనా ? మీ సర్వసంపదలు హరించి మీ దుర్మదంబు నడంపకున్న నే సార్వభౌముఁడనేనా ? నిండుసభామధ్యంబున సకల రాజసమక్షంబున బత్నీసమేతముగ మీ మాన మారడివో జేయకుండిన భూమండలంబున నింకను దుర్యోధనచక్ర వర్తి నని పిలిపించుకొందునే ? (పరితాపక్రోధాసూయలు మూర్తిమంతంబులైనట్లు నటించుచు) పాండ వాంకుర మారణహోమమునకై హృదయకుండమునఁ గ్రోధాగ్ని ప్రజ్వరిల్లుచున్నది. నలుదెసల నాక్రమించు చున్నది. మంత్రపాఠకులులేరె ? ఏమి కర్తవ్యము. ఏమి కర్తవ్యము. ఈ యవమానసంజనితసంతాప మవార్యమై నను నిలిచినచోట నిలువనిచ్చుట లేదు. ఏమిసేయుదు ? కట్టా ! దుర్వారదర్వీకరనిర్వాంతవిషవహ్నికీలలకైన దాళియుండ నగునుగాని ఈ దుర్వ్యథకు దాళియుండుట దుర్ఘటము. కాలకంఠఫాలనేత్రాభీలకీలికీలాకలాపంబున కైన నోర్చియుండ నగునుగాని యీ యవారణదారుణా టోపంబు దుస్సహము. ప్రళయసమయసముద్దండదండధర చండాతిచండదండపాతంబునకైన సైపనగునుగాని భీషణాతిభీషణం బగు నీ శోషణంబున కోర్చుట దుస్స హము. అబ్బా ! (ఒడలంతయు సెగలు గ్రక్కుట సూచించుచు) దేహ మాపాదమస్తకమును మంట లెగయుచున్నవి. ఈ పరితాపమున కంత మెప్పటికి? ఔరా! దరిద్రుని ఆత్మసంతృప్తికైన మిత ముండునుగాని నా

యీ పరితాపమునకు మేరలేకున్నదే? (అసూయావమాన క్రోధపరితాపముల పరమావధిని నటించుచు) కర్తవ్యాకర్తవ్యవిచారణము లేదు, పుణ్యాపాపవివక్ష లేదు. కీర్త్యపకీర్తులు లేవు. కారణాకారణములు లేవు. బంధుత్వాబంధుత్వములు లేవు. భయము లేదు, భక్తి లేదు. పాండవేయ ప్రకల్పిత నిష్ఠురపరిభవ త్రిశూలోద్ఘట్టిత కౌరవవంశవర్ధన మనఃకంఠీరవంబు యథేచ్ఛావిహార వ్యవహారంబుల నప్రమత్తవృత్తి నిరాటంకముగ విజృంభించితీఱవలసినదే.

(తలయూఁచుచు) పాండవదుర్మదవిభంజన విధానము ప్రథమ కర్తవ్యము. పాండవపట్టమహిషీదారుణపరాభవంబు ద్వితీయ కర్తవ్యము. పాండుభూపాల కులోన్మూలనము అనంత రాచరణీయము,

(నేపథ్యమున) "అహో! ఈ ఇనుని దివసదీక్షాధికారము చెల్లిపోవుచున్నదే?

ఉ. కాలవశంబునన్ స్వకరకాండబలం బుడుగంగ వారుణీ
శైలశయానుఁడై. తనకు శాత్రవుడైన సుధాంశుఁ డింక మి
న్నేలునో యంచుఁ దద్వ్యధకు నీ యినుఁ డంపిన శక్తులో
యనన్
గాలము వేచియున్నయవి క్రమ్మి పయింబడఁ గాఱు
చీఁకటుల్.

ఓహో! సమయసూచకులు దివసావసానమును దెల్పుచున్నారు. కర్ణదుశ్శాసనసౌబలు లిచ్చటికిఁ జేరునప్పటికి నేనును కాలసవనములందీర్చి వచ్చెద.

(నిష్క్రమణము)

## ద్వితీయ రంగము.

మందిర ద్వారము. అర్థరాత్రిసమయము.

సౌబలుఁడు యోజించుచున్నవాఁడుగా ప్రవేశించుచున్నాఁడు.

సౌ—(కలయంజూచి) అహో! ఆవిర్భవించిన శాంబరీప్రభావమో యన గాఢాంధతమస్సు సూచికాభేద్యం బై దిశాచక్రంబు నాక్రమించి యున్నది. నిరక్షరాస్యుని మానసావకాశమువోలె నాకసం బంతయు నక్షత్రశూన్య మై తోఁచుచున్నది. నిబిడాంధకారపటలాచ్ఛాదిత యగుటం జేసి జగతీకాంత చైతన్యవిరహిత యై చూపట్టుచున్నది. సర్వసంపదలు గోల్పడినవాని మానసమువోలె ప్రకృతి యంతయుఁ జింతాజడంబై కనవ్పట్టుచున్నది. ఇట్టి ఘోర నిశాసమయంబున దుర్యోధనుండు నన్ను బిలువనంపు టేలొకో ? (స్మృతి నభినయించి) ఆఁ స్ఫురించినది. గత దినంబున మాయిరువురకుం జరిగిన సంభాషణలో పాండవవైభవ ప్రస్తావన వచ్చినపు డాతని ముఖవైఖరుల వలనను సంభాషణసందర్భమునను బాండవులపై నాత డుత్కటక్రోధము వహించి తత్సామ్రాజ్యవిధ్వంసన మాచరించి తన పగనంతయు దీర్చికొన నుంకించుచున్నట్లు స్పష్టముగ వ్యక్త మైనది. (తలయూఁపుచు) కావున తత్కార్యసాధనోపాయముల నాలోచించుటకే న న్నాతఁ డీ సమయమున బిలువనంపిన ట్లున్నది. మంచిది. సందర్భానుసారముగ పాండవవైభవప్రస్తావనఁ జేసి యాతని క్రోధలతకు దోహద మొనర్చి చిరకాల

ప్రవర్ధితం బగుచున్న మన్మనోరథాంకూరము పుష్పించి ఫలించున ట్లొనరించెద. (స్మృతి నభినయించి) తండ్రీ! నీ వాంఛితము నీడేర్చి సుపుత్రుండ నయ్యెద. (జేబులోని పసుపుగుడ్డమూటను దీసి విప్పి పాచికలను కన్నుల కద్దికొని) యక్షరాజములారా! యోగ్యకాలమున మీ ప్రభావమును బ్రకటించి నన్ను పితౄణమునుండి విముక్తుని గావింపుడు. (మరల మూటఁగట్టి కన్నుల కద్దికొని జేబులో నుంచికొని) కులనాశకుఁ డగు యీ సుయోధనుఁడు పూజ్యపాదుఁ డగు నా జనకుని నిష్కారణముగా కారాగారమున బంధించి నానావిధ మహాభయంకర హింసాకాండను సాగింప నిరపరాధి యగు నావృద్ధుఁడా బాధలకు దాళుకొనలేక మహావ్యథలకుఁ బాల్పడి క్రుక్కుచు నవసానసమయమున నన్ను బిలిపించి కుమారా! ఈ బాధ ననుభవించుచు నే నింకను జీవింపఁ జాలను. ఈ దుర్యోధనహాతకుఁడు నిష్కారణము నాకు విధించిన లోకవిరుద్ధమరణదండనమునకు బ్రతీకారముగ నీవు వీని వంశక్షయంబుఁ జేసి పితౄణమునుండి విముక్తుఁడ వై నాకు మనశ్శాంతిని కలిగింపుము. దుర్నివారుఁ డగు వాని వంశక్షయంబు నే నెట్లుసేయగలనా యని వగవకుము" అని చెప్పుచు తన వెన్నెముకను దీసి నా కొసంగి యిదిగో మంత్రనిష్ఠిత మగు శల్యము. దీనితో పాచికలను జేసి వాని నుపయోగించి దుర్యోధనునికోఱకు పాండవులతో జూదమాడి వారి సామ్రాజ్యసర్వస్వమును వారిని యోడిచికొని దుర్యోధనుని కరగతంబు గావిం

పుము. దీనికిం దగినయదను ముందు రానున్నది. ఈ దుర్యోధనహతకుఁడు పాండవులదెస తనకుంగల సహజ వైరముం బురస్కరించికొని వారిని నిండుసభలో నవ మానింపఁగలఁడు. అదికారణంబుగా భీమహర్యక్షంబు చెలరేగి కౌరవయూధంబును రూపుమాపును. దానిచే నాకు మనశ్శాంతి కలిగి యుత్తమగతులం బడయుదును. కావున బిత్రాజ్ఞను బాలించి వంశకరుఁ డగు సుతుండ వగు మని యాదేశించి అట్లయని నాచే శపథము చేయించి తన పృష్ఠశల్యమును నా కొసంగె. జనకుని మనోభీష్టమును నెఱవేర్చి సుపుత్రగణమునం జేరుట కిదియే సమయ మని నా మనస్సాక్షి న న్నుద్బోధించు చున్నది. (యోజించి) అగుగాక. ఇంక నే నతిజాగరూక తతో మెలంగవలయు. (స్మృతి నభినయించి) తండ్రీ! సుబలమహీపతీ! నీ పుత్రున కభీష్టసిద్ధి యగున ట్లాశీర్వ దింపుము. (కన్నులు విస్ఫారితముల నొనరించి) తండ్రీ! న న్నాశీర్వదించుచున్నావా? ధన్యోస్మి. అనుగ్రహింపఁ బడితిని. (నిమిషము నిమీలితనేత్రుఁడై, త్వరతో) కర్ణ దుర్యోధన దుశ్శాసను లిప్పటికి మంత్రాలోచనాభవనం బునకుఁ జేరియుందురు. (తలయూఁచుచు) ఇంక సుయో ధనుండే సాధనంబుగా సౌబలనీతిం బ్రదర్శించెదఁగాక.

(తలయూపుచు నిష్క్రమించుచున్నాఁడు.)

నిష్క్రమము.

—ooo—

స్థలము : మంత్రాలోచనభవనము
(కర్ణగుర్యోధన దుశ్శాసను లుపవిష్టులై యుందురు.)

దుశ్శా—అంగరాజా! మాతులుం డింకను రాకున్నాఁడేమో!

కర్ణు—కారణము తోపకున్నది. (చెవియొగ్గి) అల్లదే! అడుగుల చప్పుడు వినవచ్చుచున్నది. ఆతఁడే కానోపు.

(సౌబలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దుశ్శా—మాతులా! ఇంత యాలసించితివేల?

సౌబ—(తలయూఁపుచు నూరకుండును.)

కర్ణు—సౌబలా! ఏమి యోజించుచున్నావు.

సౌబ—ఏమున్నది. మయునిచే సర్వలోకాతిశయ లక్ష్మీసంపన్నం బగు సభాభవనమును బారితోషికంబుగా గొని (దుర్యోధనుఁడు చకితుఁ డగును) పాండవులు స్వశక్తి మై దిగ్విజయంబుఁ జేసి రాజసూయాధ్వరనిర్వహణమున సార్వభౌమపదంబును బ్రాపించి నిస్సపత్నముగా వెలుగొందుచున్నారు. ఔరా! ఏమి వారి విజృంభణము.

దుర్యో—అగుగదా? లోకవృత్తమును జక్కగ గు ర్తెఱింగిన మీకు నేనేమి చెప్పవలయు? నిశాచరుఁడు పూర్వపర్వత శృంగాగ్రము నలంకరించినపుడు చండకరుం డయ్యును లోకబాంధవుం డగు యినుం డస్తాద్రిని గ్రుంకుట దిన దినము మన మనుభవపూర్వకముగఁ జూచుచున్నాము. నేఁటి పాండవ విజృంభణమును జూడ కొలఁది దినములలో వారు మాచేసె తము కష్టముంగొనుట సూచించెడు.

కావున మన మధోగతిపాలు గాకుండుట కెయ్యది మార్గమో మీ రెల్లర రిప్పుడ యోజించి నిర్ధరించునది.

కర్ణు—నీవు వచించినది ముమ్మాటికి నిక్కము. దుర్యోధన సార్వభౌమా! నీవు మహావీరుండవు. వైరిహృత్స్ఫుటభేదనోగ్రపరాక్రమోపార్జిత కీర్తితేజస్సమాహృతభువనాంధకారుండవు. భరతకులాలంకారుఁడవు. అనేక శతసహస్రవాహినీవహంబున కధినాథుండవు. నిరంతర భిక్షాజీవను లగు పంచపాండవులకు వెఱచియా వారల నిర్జించుట కేది మార్గమో యోజింపుమనుట? ఔరా! ఏమి కాలవైపరీత్యము? తాటియాకుల చప్పుళ్ళకు జడిసి పేరెములు వారు మృగార్భకంబులం జెండాడుటకా మదమత్తకుంభికుంభవిదారణదారుణ నఖరాజివిరాజమానం బగు మృగరాజంబు భీతినొందుట? ఓ సుయోధన సార్వభౌమా! అట్టి యవసరమే తటస్థింపవలెఁ గాని సుయోధన సార్వభౌమ విజయలక్ష్మీవ్రతోద్యాపనమున భవన్మిత్రుండు కర్ణుం డొక్కరుండు సాలఁడే? సార్వభౌమా! నిరంతర వైరివీరమస్తకోచ్ఛేదన సమర్థంబు లగు నీ శస్త్రాస్త్రంబులు భీషణసంగ్రామరంగంబున శత్రుశిరచ్ఛేదన మాచరించి జయలక్ష్మి నిత్యానైవేద్యదానసమర్థంబు లైనపుడుగదా సార్థకంబు లగుట? సంతత సత్ప్రతిష్ఠార్జనాసమర్థంబు లగు నీ భారతవీరశరీరంబులు దుర్వారవిద్వేషత్సమాకీర్ణ మహాభీలరణాంగంబున వీరవిహారంబు సల్పి వైరిగళోద్గళద్రక్తధారాసంసిక్తంబు లైనపుడుగదా పవిత్రంబులగుట? సిలవైన నీక్షణంబున పాండవేయ జీవజీమూతంబుల నస్మ

ద్బాణపరంపరావాతూలనిహతి చెల్లాచెదరుగా విం చి వచ్చెద. ఏమి యాజ్ఞ ?

దుర్యో—(ఉష్ణముగల దీర్ఘ నిశ్వాసముతో) అంగరాజా! వీరపుషోచితంబు లగు నీ వీరాలాపంబులవలన నస్మత్కో(పా)ర్ణవం బతిక్రాంతవేలాతటం బగుచున్నయది. (దుశ్శాసనునిఁ జూచుచు) తమ్ముఁడా! నీయుద్దేశమేమి ?

దుశ్శా—అగ్రజా! మన కర్ణునిమతం బెంతయు గ్రాహ్యము. మయమార్గప్రవర్తకు లగు భూతలనాథులు సంగ్రామ విజయాభిశోభితు లై కదా! యుగాంతరముల కైన జీర్ణింపని విధంబున స్వర్ణరజఃకజ్జలంబునఁ దమ పవిత్ర నామాక్షరంబులు భారతవీరహృదయ ఫలకంబు లలంక రింపఁ జేసినది!. కావున యుద్ధంబే పరమార్థంబు.

దుర్యో—మాతులా! వినినాఁడవుగదా కర్ణదుశ్శాసనుల యాశయములు.

సౌబ—సావధానముగ వినినాఁడను. కుమారా! మీ శౌర్య ధైర్యసాహసంబులు సెప్పవలయునా? శాత్రవుల జయింప మీలో నెవ్వరు సాలరు? అయినను ఆత్రపడి యే కార్యమును జేయరాదు. “వృణుతేహి విమృశ్యకా రిణం గుణలుబ్ధాః స్వయమేవ సమ్పదః” అని ఆర్యోక్తి. ఇది సంగ్రామము. మాటకాదు. శత్రువిజయము. మీరు తలంచినంత సులభసాధ్య మైనచో నేబాధయు నుండదు. కొంచె మోపికఁ బట్టుఁడు. లేడికి లేచినదే ప్రయాణ మని నట్లు తలంచినంతనే యుద్ధమునకు బయలుదేరుటయేనా ?

దుర్యో—మనోజవమే సర్వకార్యసాధనము.

సౌబ—అగుగాని, నా యభిప్రాయమును నొక్కింత వినుము. నలువురకు నచ్చిన ననుసరింపవచ్చును, లేకున్న మాన వచ్చును. ఆ పాండవుల నెట్లైన నుపేక్షింప రాకుండు టయే మన యందర యభిప్రాయము. వారి యౌద్ధత్య ముం గనిన వయోవృద్ధుండ నగు నాకే భరింపరాక యుండిన, నభిమానధనులై వీరరస సముగ్రులైన మీకుఁ దలమున్కలగుటలో నాశ్చర్య మేముండును? సుయోధనా! ఈ కర్ణుఁడు సామాన్యుఁడు గాఁడు. అప్రతిమాన శూరాగ్రగణ్యుఁడే. దుశ్శాసనుఁడో- నిరుపమానశౌర్య రాశియే. సందేహములేదు. ఇంక నీవిషయ మనిదంపూర్వము. కాని,

దుర్యో—అయినచో నింకను కానియేమి?

సౌబ—సంగ్రామ మనిన యెన్ని వ్యయప్రయాసము లనుభవింపవలె. అనుభవింతము, జయంబు సిద్ధింపవలెగదా? అదియును గరతలామలకమే యనుకొందము. రణమునకుఁ గారణ ముండవలయునా? నిష్కారణముగఁ బాండవుల పై దండువెడలిన జయాపజయంబులవలన నేమగును. గౌరవు లక్రమముగఁ బాండవుల సంపద హరింపఁ దలంచి వారల పై కత్తిగట్టినను నపవాదమునకు ప్రప్రథమమున గురిగాక తప్పదు. ప్రజలలో నసంతృప్తి స్థాన మేర్పడును.

దుర్యో—ఇది రాజధర్మమేకదా

సౌబ—ఎంతరాజధర్మ మైనను ప్రజాభిమతంబును రాజున కవశ్యవిచారణీయమే. కాదన్నను ఇంటఁ గెలిచికదా, రచ్చఁ గెలువవలయును?

దుశ్శా—అయిన నీ వేమందువు?

సౌబ—ఏ మందును? ఇప్పటి మీయుద్యమము క్షత్రియోచితమే యైనను గులవృద్ధు లెవ్వరికిని యంగీకారము కాదు. మీ జనకుం డన్ననో పాండుపుత్రులపై గల వాత్సల్యంబున వారలతో వైరము స్వప్నమం దైన నంగీకరింపఁడు. ఇంక భీష్మద్రోణవిదురాదు లియ్యది వినుట కైన సహింపరు. నూతనముగ రాజసూయ మొనరించినందున దేశమాసకలంబును బాండవపక్షంబు. కాలమా! పరానుకూలంబు. పరులా – దుర్నిరీక్షులు.

గీ. లెక్కసేయఁ డొకండు వాసవుని పవిని
బకజరాసంధుల నొకండు బారిసమరె
గనలుచో నొక్కరుని కడగంటిచూపు
వీక భస్మీకరించు ముల్లోకములను.

కర్ణు—సౌబలా! శాత్రవుల శౌర్యవర్ణనమున నీ కింత పరిపూర్ణపాండిత్య మలవడిన దని నే నింతకును నెఱుంగను సుమా!

సౌబ—అంగరాజా! స్వపక్షప్రశంసయే ప్రధానముగఁ దలంపక వచ్చుఁబోకలఁ దీవ్రముగ నాలోచింపుఁడు. దుర్యోధన దుశ్శాసనులారా! దండనము చతుర్థోపాయము. శాత్రవులను జయించు టతిసులభము. అద్దానికి నే

నొక్కరుండ చాలుదు. సేనానీకంబు లనపేక్ష్యంబులు, రథగజతురంగాదు లవాంఛితములు. ఖడ్గాదు లపరిగణనీయంబులు. పురంబు వెలువడ నక్కఱలేదు. భోగంబులఁ బెడఁబాయ నక్కఱలేదు. ఇంతయేల! నీ పరివారము కాలు కదప నక్కఱలేదు– నీవు సింహాసనము డిగ్గ నక్కఱలేదు. అపనిందాభయంబు లేదు. అశ్రమకార్యము. జయంబు సర్వసిద్ధము.

దుశ్శా—మాతులా! అట్టి మహోత్కృష్టోపాయం బెయ్యది?

సౌబ—ద్యూతము.

కర్ణు—ఇది కేవలము పందలు, నీచులు నవలంబింపవలసినది కాని పౌరుషవంతు లగు సుక్షత్రియుల కవలంబనీయము కాదు. పాప మిదియేనా? నీ వింతదనుక వర్ణించి శ్రమ పడినది?

సౌబ—అగును. అరువదినాల్గు కళలలో నొక్కటి యగు ద్యూతకళను నీ వెట్లు కా దనఁగలవు?

కర్ణు—ఇది రాజలక్షణమా?

సౌబ—కా దని యెవ్వరనఁగలరు?

కర్ణు—కీర్తిప్రతిష్ఠార్జనాసక్తులు

సౌబ—క్షత్రియధర్మాపరిజ్ఞాత లైన

దుశ్శా—కాకున్న

సౌబ—కాదనరు. నలప్రభృతరాదు లేనాఁటివారలు? ద్యూతము రాజధర్మవిరుద్ధమైనచో చక్రవర్తి శిరోభూషణం బగు నలసార్వభౌముఁ డంగీకరించునా? ఆతఁడు రాజధర్మానభిజ్ఞుం డందురా?

కర్ణ—ఆ మహామహుఁడుమాత్రము రాజనామ మాత్ర విరాజమానుఁడు కాఁడుగాని, అది కలిప్రేరణముగదా!

సౌబ—కలిప్రేరణ మోటమికేఁగాని ద్యూతఖేలనమునకుఁ గాదు. కావున దురోదరం బప్పటినుండియు రాజగౌరవార్హంబనియు రాజధర్మం బనియు మీ కిప్పటికైన నవగతమైనదా?

కర్ణ—జూదంపుటాటవలన గెలుపుఁ గొనుట పురుషార్థముగఁ బరిగణింపఁబడునా?

సౌబ—పడ దనుట కెవ్వఁడు సమర్థుఁడు? పురుషార్థము కాదని యే శాస్త్రములోనైన లిఖింపఁబడియున్నదా? శాత్రవుల జయించుట కేమార్గ మైననేమి? మనకు జయంబు సమకూరుట ప్రధానము. సుయోధనా! నీవు బాగుగా యోజించికొనుము.

దుర్యో—అంగరాజా! సులభోపాయంబున శత్రువులను నిర్జించుటయేకదా—ప్రకృతవాంఛితంబు. దానికి మన కేమార్గమైననేమి? జూదంబును రాజధర్మవిరుద్ధము కాదు.

కర్ణ—రాజచంద్రు లద్దాని నధర్మం బనికదా గర్హించుచుందురు?

సౌబ—అధర్మం బనికాదు. ఓటమి కలుగు నని.

దుర్యో—పరుల నెవ్విధి నైన జయించుట కర్తవ్యంబుగాని ద్యూతయుద్ధములు కావు. అందునను నిది యత్రేమవ్యవసాయంబు.

కర్ణు—రాజా! నీవే యంగీకరించిన నే నేమనువాఁడ?

దుశ్శా—సరియే! ఇందుమాత్రము జయంబు సిద్ధాంతీకరించు టెట్లు?

సౌబ—దానికి మీ రావంతయు సంశయింపఁ బనిలేదు. పాచికలు చేతనున్న సౌబలునిఁ గెలువ హరిహరబ్రహ్మల కైన దుస్సాధ్యము.

దుశ్శా—అని నీ వెట్లు నిర్ణయింపఁజాలుదువు?

సౌబ—నిదర్శనములు గావలయునా?

దుశ్శా—చూపఁగలుగుదువా?

సౌబ—నిరాక్షేపముగ (జేబులోనున్న పసుపుగుడ్డమూటను దీసి విప్పి పాచికలను కన్నులకద్దికొని) ఇవిగో యక్షములు వీనితోఁ బందెము వైచిన నే నెట్లుద్దేశించిన నవి యావిధముగాఁ బడి తీఱవలయు.

దుశ్శా—మాతులా! నీ చేత నున్నపుడుగదా! ఆ సారెలు నీవు చెప్పినట్లెల్ల బడుట! అయ్యవి పరహస్తగతంబు లైన పుడుగూడ జయంబు నీ దని యెట్లు నిర్ధారణ సేయఁ గలవు? ధర్మజుండును జూదంపుటాటయం దసమాన ప్రతిభావిశేషుం డని విందుము.

సౌబ—కుమారా! ఇవి నాచేత నున్ననేమి మఱి యెవ్వరి చేత నున్ననేమి? పందెముమాత్రము నాయిష్టానుసారమే పడవలయును.

కర్ణు—ఇది యేమో విపరీతప్రతిభ. (సారెలు చేతఁ దీసికొని) నాచేతనున్న సారె లెన్ని తిరుగఁబడునో చెప్పుము?

సౌబ—మూఁడు తిరుగఁబడును. (కర్ణుఁడు వేయఁగా నట్లే పడును. దుర్యోధనుఁడు సారెలు చేతఁదీసికొని గలబరించుచు)

దుర్యో—మాతులా! ఈమాఱు చెప్పుము.

సౌబ—కుమారా! యీమా అన్నియును దిరుగఁబడును. దుర్యోధనుఁడు వేయఁగా నట్లేపడును.

దుశ్శా—(ఆతురముతో సారెలు చేతఁగొని) ఏదీ! ఈమాఱు చెప్పుము. రెండు సారెలు తిరుగఁబడి ఒకటి సగము తిరుగఁబడి నిలువున నిలిచియుండవలయు.

సౌబ—అబ్బా! ఏమి విషమపరీక్ష? నీకోర్కి యిదియేనా? వేసిచూడుము.

దుశ్శా—(వేయఁగా నట్లే పడును. నిలిచియున్న పాచికను చేతితో త్రోసి) ఈ పాచికను ద్రోసినను దిరుగఁబడకున్న దేమి?

సౌబ—నీవు త్రోసినఁ మాత్రమున దిరుగఁబడిన యింక నే నెందులకు?

కర్ణు— అయిన నీ వాజ్ఞాపించి తనంతఁ దానిం దిరుగఁబడఁ జేయఁజాలుదువా?

సౌబ—న న్నెంతగఁ బరీక్షించు చున్నారయ్యా! అంగ రాజా! నీ యభీష్టము నెఱవేఱుగాక.

(పాచికపడును)

దుర్యో—అంగరాజా! ద్యూతజయంబు నిశ్చయ మనుట కింకేమినిదర్శనము గావలయును?

సౌబ—సరికదా! ఇప్పటి కైన నా యక్షవిద్యాదక్షత మీకు విశద మైనదా? దీనిచే నొక్క ధర్మజునేకాదు. యక్ష విద్యయం దారి దేఱినవార మని బిరుదులువహించి మే మజేయులము, మే మజేయుల మని నీల్గువారల నెవ్వారి నైన నొక్కత్రుటిలో నిర్జింపఁజాలుదు. ఇది నిశ్చయము. నిస్సంశయము.

కర్ణు—సౌబలా! మంచిది. దీనికిమాత్రము వృద్ధరా జంగీ కరించునా? భీష్మాదు లిష్టపడుదురా.?

దుశ్శా—ఇది అడుగదగినదియే.

దుర్యో—మాతులా! ఏమి సమాధానము.

సౌబ—పురమే లే దంతఃపుర మన్న ట్లున్న దీవ్యవహారము. తొలుత ద్యూతఖేలనమునకు మే మెల్లర మంగీకరించితి మనినఁగదా? పిమ్మట యాలోచనము?

దుర్యో, దుశ్శా—మే మంగీకరించితిమి.

సౌబ—మన కర్ణుని యభిప్రాయము?

కర్ణు—సార్వభౌముఁ డంగీకరించినఁ జాలదా ?

సౌబ—అయినఁ జెప్పెద. ఇప్పట్టునఁ బాండవుల నేగతి నిర్జిం చుటకును గులవృద్ధు లెవ్వరును నంగీకరింపరు. కావున దీనిని మన మతిరహస్యముగ నిర్వర్తింపవలయు.

దుర్యో—అ దెట్లు ?

సౌబ—నే నంతయుఁ దీవ్రముగ యోజించియే మీ కీవిష యమును నివేదించితిని. ( సుయోధనుని భుజముపైఁ దట్టుచు) సుయోధనా ? నీ విప్పుడపోయి నీ తండ్రిచే నొక నూతనసభానిర్మాణమున కనుజ్ఞ గైకొనుము.

దుర్యో—తరువాత ?

సౌబ—మిమ్ములను వారలు రాజసూయమున కాహ్వానించిరి గదా ? అట్లే నీవును నూతనసభాప్రవేశోత్సవమునకుఁ బాండవులను సకుటుంబముగ నిచ్చటి కాహ్వానింపుము.

దుశ్శా—ఆహ్వానించి-

సౌబ—తత్సభావలోకన సమయమున సమయానుకూలముగ ధర్మజునితో నొకింత ద్యూతప్రస్తావన సేయుము. పిమ్మట విషయమునకు నే నున్నాఁడనుగదా ?

దుర్యో—ఇది బాగుగానే యున్నది. పిలిపించుటకు జనకు నకుఁగాని వచ్చుటకు పాండవులకుఁగాని ఏమాత్రము సంకోచింపఁ బనిలేదు.

దుశ్శా—సరియే. ధర్మజుఁడు జూదమాడ నీయకొనునా ?

దుర్యో—ఇదియు విచారణీయాంశమే.

సౌబ—తెలియునా! సుయోధనా! ధర్మజుఁడు ద్యూత ప్రియుఁడు.

దుర్యో—మంచిది. కాని, దీనికిమాత్రము వృద్ధరాజంగీక రించునా? భీష్మాదు లిష్టపడుదురా?

సౌబ—కుమారా! తొలుతనే ఇన్ని సందేహములైన నెట్లు? కడమప్రక్రియకు నే నున్నాఁడ నంటినికదా!

దుర్యో—అట్లయిన సభానిర్మాణమున కనుజ్ఞ నైకొన మందువా?

సౌబ—అవశ్యము. కాని స్థలనిర్దేశ మిప్పుడే చేయకుము.

దుర్యో—ఏమి?

సౌబ—చెప్పెదనుగదా!

దుర్యో—సరియే. సోదరా! నీ వేగి జనకుని దర్శింప సమయ మగునో కాదో విచారింపుము.

దుశ్శా—మంచిది.

(నిష్క్రమించును.)

సౌబ—కుమారులారా! సముద్రగర్భమున బడబానలము, మన గర్భముల నీ రహస్యము.

దుర్యో—అట్లే.

కర్ణు—సార్వభౌమా! నేఁ బోయివత్తును.

దుర్యో—మంచిది.

(కర్ణుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సౌబ—కుమారా! ఇంక నే బోయివత్తునా ?

దుర్యో—సరియే.

సౌబ—(ముందునకువచ్చి సాభిప్రాయముగఁ దలయూఁచి(స్వ) ఇప్పుడు మారణహోమమున కంకురార్పణం బైనది. " షడ్భిర్మనుష్యయత్నాని స_ప్తమం దైవచింతనమ్ " (స్మృతి నభినయించి) తండ్రీ! పితౄణవిముక్తి కై పరితపించు నీ తనయుని యాశీర్వదింపుము.

(నిష్క్రమించుచున్నాడు.)

దుర్యో—ఇప్పటికి మానసమున కొంకింత స్వాస్థ్య మేర్పడినది. (యోజించి) భీముఁడు లిది యెద్దియేని మోస మని చెప్పి ధర్మజుని వారింతురా ? (యోజించి తలఁద్రిప్పుచు) మొనమొన్నఁగదా రాజసూయమున కేగి వారితో పరమ సఖ్యము నటించి వచ్చితిని. కావున నూతనసభాప్రవేశోత్సవమునకు వా రిచ్చుటకి వచ్చుట నిశ్చయము. ద్యూత ప్రియుం డైన ధర్మజుఁడు ద్యూతరంగమునఁ బ్రవేశించుట నిశ్చయము. మాకు జయంబు సమకూరుట నిశ్చయము. తరువాత నా బంధకిని (క్రోధముతో మీసము ద్రిప్పుచు) ఇప్పుడే సభానిర్మాణమునకు జనకుని యనుజ్ఞ గైకొనియెద.

(నిష్క్రమము)



స్థలము : హస్తిపురి రాజమందిరము

(ధృతరాష్ట్రుఁడు ప్రవేశించుచున్నాడు)

ధృత—దుర్యోధనుఁడు ఇంద్రప్రస్థమునుండి వచ్చినదిమొద లింతదనుక మత్సమక్షమునకు వచ్చియుండలేదు.

భటు—(ప్రవేశించి) ధృతరాష్ట్రసార్వభౌములకు జయము. దుర్యోధనసార్వభౌముఁడు దర్శనార్థము ముదలకొాఱ కెదురుచూచుచున్నాఁడు.

ధృత—అవశ్యము ప్రవేశపెట్టుము.

భటు—దేవరయాజ్ఞ.

(పోయి దుర్యోధనునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

దుర్యో—పూజ్యు లగు తాతపాదులకు దుర్యోధనుం డభివాదనము లాచరించుచున్నాఁడు.

(నమస్కరించును)

ధృత—చిరంజీవ. నాయనా! దుర్యోధనా! రమ్ము. (దుర్యోధనుఁడు సమీపించు చున్నాఁడు. దగ్గరకు తీసికొని తలమూర్కొని) ఇంద్రప్రస్థమునుండి వచ్చినదిమొద లింతవరకు జనకుని దర్శింపకుండితి వేల?

దుర్యో—ప్రయాణపు బడలికచే వెంటనే దర్శింపనైతిని. క్షమింపుడు.

ధృత—కానిమ్ము. (దుర్యోధనునిశరీరము నిమురుచు) తండ్రీ చాల చిక్కినట్లున్నావు. కారణము?

దుర్యో—మనవిచేసితినిగదా, ప్రయాణపు బడలిక యని.

ధృత—నాయనా! పాండవాగ్రజుని రాజసూయము సర్వాంగ సుందరముగ జరిగినదిగదా?

దుర్యో—లోప మేమున్నది? తండ్రీ! రాజలోకము సమర్పించు పసదనముల నందికొనుటలో నేమి, కవిపండిత గాయకాదుల బహూకరించుటలో నేమి— క్షణము సేపైన నూపిరి ద్రిప్పికొనుట కవకాశము లేకపోయిన దనినచో దాని యాతిథ్యౌత్కృష్ట్యము తమకు విశదము కాకపోదు. వీని కన్నింటి కేమిగాని, మయసభానిర్మాణమే నామనస్సు నేమి, సర్వజనలోకమానసమును సంపూర్ణముగ నాకర్షించినది.

ధృత—అట్టిదియా తండ్రీ! చూచుటకు నాకుఁ గన్నులు కఱవయ్యెగదా? (తలయూఁచుచు)మయబ్రహ్మనిర్మాణము.

దుర్యో—జనకా!

గీ. ప్రకృతి ప్రత్యక్షమై నిజప్రాభవంబు
బహుముఖాల నభివ్యక్త పఱచినట్లు
భ్రాజితం బయ్యె మయసభాభవనసీమ
త్రిభువనంబుల దానికి దీటులేదు.

(ధృతరాష్ట్రుని చేతినిఁ దన చేతిలోనికి తీసికొని నిమురుచు) జనకా! అట్టి సభాభవనము నొకదానిని మనమును నిర్మింపఁజేసిన హస్తినాపురలక్ష్మి కొక నూతనాలంకారమును సమకూర్చిన ట్లగునుగదా?

ధృత—నాయనా! మానవశిల్పుల కట్టిదానిని నిర్మించుట సాధ్యమా?

దుర్యో—దాని నాదర్శముగాఁగొని మఱియొకదానిని నిర్మించుట శిల్పకళాకోవిదులకు దుస్సాధ్యము కాదుగదా?

ధృత—(అత్యాదరముతో తండ్రీ! నీ యభిలాషమును ద్రోసి పుచ్చుదునా? జనకుల సంపదలు సంతానమనోరంజనార్థమేకదా? నీ యభీష్ట మనతికాలంబున నెఱవేఱుగాక! ఓరీ: ఎవఁడురా! అక్కడ.

భటు—(ప్రవేశించి) చిత్తము. మహాప్రభూ!

ధృత—మన యాస్థానశిల్పాచార్యులను సభారంగమునకుఁ దీసికొనిరమ్ము.

భటు—మహాప్రసాదము.

(నిష్క్రమించును)

ధృత—కుమారా! నీ జనయిత్రిని దర్శించితివా?

దుర్యో—ప్రప్రథమమునఁ బితృపాదుల దర్శించి యనంతరము మాతృదేవతాపాదాభివందన మాచరింతమని ఇటు వచ్చితి.

ధృత—ఆ సౌబలస్వాస నీరాక కెదురు సూచుచుండును.

దుర్యో—సెలవు దయసేయించిన మాతృపదపూజన మాచరింతును.

ధృత—అట్లే చేయుము.

దుర్యో—నా కింక సెలవు దయచేయుడు.

ధృత—మంచిది నాయనా ! పోయిరమ్ము.

దుర్యో—(నిష్క్రమించుచున్నాడు.)

(భటుడు దారిచూపఁగా)

ధృత—ఎవ రక్కడ ?

భటు—(ప్రవేశించి) దేవరయాజ్ఞ-

ధృత—మమ్ములను బూజామందిరమునకుఁ గొనిపొమ్ము.

భటు—మహాప్రసాదము.

(భటుడుచేయి పట్టుకొని ధృతరాష్ట్రుడు
నిష్క్రమించుచున్నాడు)



# ద్రౌపదీమానసంరక్షణము

## చతుర్థాంకము

### ప్రథమ రంగము

స్థలము : సౌబలుని మందిరము

(ఆలోచించుచున్నవాఁడుగా సౌబలుఁడు)

సౌబ —(తలద్రిప్పుచు) పరిస్థితు లింతవరకు సుముఖముగనే యున్నవి. కార్యసాధన కత్యంతవిఘ్నకారకు లగు భీష్మద్రోణుల నిరువుర నాకాలంబున కిక్కడ లేకుండఁ దప్పింప మార్గ మేదియా యని యోజించుచుంటిని. నిర్వ్యాజప్రేమచే దైవంబును నాప్రయత్నంబునకుఁ దోడయ్యె. పురుషకారమున్న దైవంబు తోడగు నని పెద్దలు చెప్పునది వ్యర్థజల్పనము కాదు. (తలయూఁచుచు) భీష్మునకా దుస్స్వప్నంబు వచ్చుటయు వచ్చినంతనే ధనురాచార్యసహాయుం డై యాతఁడు దీర్ఘయాత్రకు బయలుదేరుటయుఁ గృపుని తనస్థానంబున నియోగించి ముద్రాంగుళీయకము నాతని యధీనము సేయుటయు, నా ప్రయత్నమున కనేకవిధముల సహకారము లయ్యె. (తలయూఁచుచు సంతోషముతో) వహ్వా యిట్లుండవలదా? (యోజించి) నా ప్రయత్నమున కింకేమేని విఘాతములు సంభవించునా? (స్మృతి నభినయించి) పన్నిన పన్నుగడయా— అమోఘము చేయుచున్న కృషియా అపారము. జరుగుచున్న కృత్యములా! అత్యంతానుకూలములు.

అన్నింటిని మించినది జనకుని యాశీర్వచనము. సంకల్ప సిద్ధి కరతలామలక మనుట కిం కేమిసందేహము? (తల యూఁచుచు) కానిమ్ము. ప్రప్రథమమున కౌరవపాండవ కులద్వయంబునకు శనిసార్వభౌముఁడ నై యనంతర మీ భారతవర్షమున కంతకు శకునిసార్వభౌముఁడ నయ్యెద గాక. (నవ్వుచు) నా కృషియంతయుఁ దనకొఱకే యని పాపము వెఱ్ఱిదుర్యోధనుఁ డెంత యుప్పొంగుచున్నాఁడు? (తలయూఁచుచు) మంచి దాతని నట్లే తలంపనిమ్ము. (వినుట నభినయించి) ఏమి యా సవ్వడి? (నిక్కి-చూచి) ఓహో: దుర్యోధన దుశ్శాసనులు వచ్చుచున్నారే?

(దుర్యో - దుశ్శా - ప్రవేశించుచున్నారు)

సౌబ—(ఎదురేగి) కుమారులారా! రండు. ఈ యాసనముల నలంకరింపఁజేయుఁడు.

దుర్యో. దుశ్శా—(కూరుచుండెదరు.)

దుర్యో—మాతులా! ఎప్పుడును నీ వేదియో యోజించు చునే యుందువు.

సౌ—కుమారా! ఎల్లప్పుడును నీ సేమమునే కోరు నాకు వేఱుయోజన లేముండును?

దుశ్శా—మాతులా! నీవు వర్తమాన మంపిన విశేష మేమి?

సౌ—సుయోధనా! ధర్మజుఁడు తనంతఁ దానుగ నిన్నే దేని ఖేలనమునకుఁ బురికొల్పు నుపాయము నాలోచించి యున్నాఁడను. తొలుత నీ లేఖను జూడుము.

దుర్యో—(తీసికొని) ఏమిది? తమ్ముఁడా! దీనిం జదువుము.

దుశ్శా—(విప్పి) శ్రీమత్కౌరవకులప్రదీపకుని యుధిష్ఠిరుని
తీర్థయాత్రాతురుఁడు, శాంతనవుఁడు, శుభపరంపరా
వాప్తిగా నాశీర్వదించి వ్రాయు లేఖార్థములు. నే నొక
దుస్స్వప్నము గనుటచేఁ దీర్థసేవ యొనర్పవలసినవాఁడ
నై రాజకీయవ్యవహార నిర్వహణమున నాస్థానమునఁ
గృపాచార్యుని నియమించి ధనురాచార్యసహాయుఁడ నై
రే పుదయమునం దరలిపోవ నున్నాఁడను. ఇంక నిచ్చటి
పరిస్థితులు: రాజలోకం బీనడుమ తనకుం గప్పముం
గట్టుట మానెనని సుయోధనుండు కర్ణదుశ్శాసన ప్రేరితుం
డై సామంతశాసనంబున కుద్యోగింప విఱ్ఱవీగుచుండి విచిత్ర
వీర్యాత్మజుం డాచార్యులచే నీతిని గఱపించియు ననేకవిధ
వినోదములం దగిల్చియు మఱపింప నెంచి తద్విధప్రయ
త్నము లనేకం బొనర్చుచుండె. దుర్యోధనుని కోరిక పై
నిప్పు డొక సభాభవనము నిర్మింపఁ బడుచున్నది. కొలఁది
కాలములో దత్ప్రవేశోత్సవము జరుగనున్నది. ఆనాటికి
రాజచక్రం బంతయు నాహ్వానింపఁ బడును. ఈర్ష్యా
ప్రధానుఁడు గావున నుత్సవావలోకనార్థసమాగతభూమీ
శనికరంబున కాతఁ డేమేని బెట్ట తలంపక మానఁడు. కర్ణ
దుశ్శాసను లాసమయమునఁ బ్రోత్సహించువారే కాని
వారించువారు గారు. కావున నప్పట్టునఁ గల్లోలము
గలుగవచ్చును. కురుకులక్షేమాభిలాషివి, సకలరాజన్య
శాసకుఁడవు, దీర్ఘదర్శివి, శాంతగుణోపేతుండ వగుట
నెట్టి కల్లోలముల కెడ మీయక నడపింపఁగలవాఁడ వీ

వొక్కరుండ వని నాభార మంతయు నీయం దుంచి విచిత్ర వీర్యాత్మజున కయిష్ట మైనను బయలుదేరుచున్నాను. ఆహ్వానము వచ్చినవెంటనే విచ్చేసి నానావిధ వినోద ములతోడను సద్గోష్ఠులచేతను దుర్యోధనుని మనం బన్య చింతాగతంబు గాకుండునట్లు ప్రొద్దుపుచ్చుచు రాజలోకంబు బహూకరింపఁబడి వెడలువఱకు నందయుండి నా లేని కొఱంతం దీర్ప గోరుచున్నాఁడను.

ఇట్లు
భవచ్ఛ్రేయోభిలాషి,
శాంతనవుఁడు.

దుర్యో—మాతులా! ఇదియేమి? గాంగేయుఁ డిట్లసంబంధముగ లిఖించినాఁడు?

సౌబ—కాదు. కుమారా! ధర్మజునకు భీష్మునియందుఁగల భక్తిం దలంచి యిటొక జాబువ్రాసి పంపిన మన పన్నుగడ కత్యంతానుకూలముగ నుండునని గాంగేయుఁ డూరలేకుండు టెంచి నేనే దీని నిట్లు కల్పించితిని.

దుర్యో—సృష్టికిఁ బ్రతిసృష్టిసేయు ప్రజ్ఞావిశేషము శ్లాఘనీయము మామా!

దుశ్శా—మాతులా! నీకీ భీష్మముద్రాంగుళీయక మెట్లు లభించె?

సౌబ—భీష్ముఁడు దీర్ఘయాత్రకై చనునప్పుడు దన ముద్రాంగుళీయకమును గృపాచార్యువశ మొనర్చుట మీకును దెలిసినదియేకదా? ఇట్టి జాబు నొకటి సృష్టింపఁ దలంచిన

వాఁడ నగుట ముద్రాస్వీకరణమున కుపాయ మాలోచించి కృపాచార్యుఁడు రత్నపరీక్షయం దసమానుఁ డౌట యెఱింగి రాజకీయపత్రములయం దాతఁడు ముద్రలు వైచు సమయమున నొక రత్నము నాతనికిం జూపి ఇది దుర్యోధనుఁడు కొనఁగోరి పరీక్షార్థము మీవద్ద కంపియున్నాఁడు అని చేతి కిచ్చితిని.

దుర్యో—తరువాత-

సౌబ—కొంతసే పాతఁడు చూచి పిదప వెలుం గున్నచో పరీక్షింప ననువుగామి గ్రొ త్తయగుటం జేసి ముద్ర నచ్చటనే మరచి తలుపులన్నియు మూయించెను. ఆ సమయమున మెల్లగ నీ పత్రముపై నాముద్ర వైచికొని మరల దానిని యథాస్థానమున నుంచితిని.

దుర్యో—అదియా? నీవు నా కుదయమునఁజూపిన రత్నము.

సౌబ—అగును. తరువాత నాతఁడు రత్నం బుత్తమజాతి దనిచెప్పి నా కొసంగెను. అనంతర మీజాబును సృష్టించి నీకు వర్తమాన మంపితిని.

దుశ్శా—మాతులా! నీ ధిషణాబల మనిర్వాచనీయము.

దుర్యో—మాతులా! నీఋణము నేఁ దీర్పఁజాలనుగాని పాండవరాజ్యలక్ష్మి మనచేఁబడినపిదప దాని కధినాథుం డవు నీవేసుమా?

సౌబ—కు మా రా! నీ యుదారస్వభావమున కిది యొక ప్రాతియా? దాని కేమిగాని, యింక శీఘ్రకాలమున

నీజాబు ధర్మజునకు జేరునట్లు సేయవలయు. మన యీ గూఢవర్తనము వెల్లివిరిసెనా? సర్వమును భ్రష్ట మగును.

దుర్యో—అది నే నెఱుఁగనా?

సౌబ—కుమారా? విదురునివిషయము జ్ఞాపకమున్నదికదా? పాండవు లిచ్చటికిఁ జేరినపిమ్మట వారితో మన మెట్లు ప్రవర్తింపవలసినదియు తరువాత యెఱింగించెదను.

దుర్యో—మంచిది. పోయివచ్చెదము. సోదరా! రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)

సౌబ—(స్వ) పాండవసామ్రాజ్యలక్ష్మికి న న్నధిపునిఁ జేయునట్లు దుర్యోధనుని ముఖముననే పలికించితిని. (తల యూఁచుచు) నా భాగ్యదేవత యచిరకాలమునఁ బ్రత్యక్షము కానున్నది. అగుగాక.

(సంతోషముతోఁ దలఁద్రిప్పుచు నిష్క్రమించుచున్నాఁడు.)

---

విష్కంభము

స్థలము : హస్తినాపురము వీధి

కంచుకి—(చేతిని కన్నులకడ్డముపెట్టికొని చూచుచు) ఏమి ఈ సమ్మర్దము? దిక్కులు దిక్కులే కదిసివచ్చి హస్తిపురముపైఁ బడుచున్నవాయేమి? ఏదిక్కుచూచినను గుఱ్ఱపుడెక్కల తాకుడుచే లేచిన పెంధూళి కొంచె మగపడియగుపడని నాకన్నులను మఱింత గ్రుడ్డివానినిఁగాఁ జేయుచున్నది. ఈ సభాప్రవేశోత్సవము నాచావునకు వచ్చిన

ట్లున్నది. ఎందఱురాజులు ఏ మట్టహాసము! కడుపునిండుగ దిని కంటినిండ నిదురవోయి నేఁటికి మూఁడుదినములైనది. నూతనసభ బహువిచిత్రముగ నున్నదని వినుటయే కాని యొక్కమా ఱటు మొగము త్రిప్పుటకైన నోచుకొనలేదు. కాకున్నను నాకును దానికిని ఎక్కడ సంబంధము! నగరమునకు నుత్తరపువైపున నున్న ఉద్యానవనములలో నదియు దక్షిణపువైపున గళ్ళకు సమీపములోనున్న తోటలలో నేనును ఇంద్రప్రస్థమునకుఁ బోయిన విదురుఁడు ఈ సాయంకాలమున ధర్మజుని సకుటుంబముగ దోడ్కొని వచ్చుచున్నానని వర్తమానమంపి యున్నాఁడు. దుర్యోధన సార్వభౌముఁడు వారికి ప్రత్యేకము విడుదల నేర్పాటు చేయుమని సెలవిచ్చియున్నాఁడు. ఇంకను నాకాభారముండనే యున్నది. వచ్చినవారందఱొకయెత్తు. వచ్చువారొక్క రొకయెత్తు. కట్టా! స్వేచ్ఛయనునది లేనేలేదు గదా! (నిరుత్సాహముతో) సేవకజీవనము. (తలయూఁచుచు)

(నిష్క్రమించుచున్నాఁడు.)



# ద్రౌపదీ మానసంరక్షణము

## పంచమాంకము

ప్రథమ రంగము :

హస్తిపురి నూతనసభ-

కర్ణ దుశ్శాసన సౌబలులు :

కర్ణ—సభాప్రవేశోత్సవము మహానందదాయకంబై యొప్పినదికాదా ? సౌబలా !

సౌబ—అది యిప్పు డనఁదగినది కాదు.

కర్ణ—ఎప్పు డనవలయునేమి ?

సౌబ—దుర్యోధనసార్వభౌముఁ డీ భవనమునఁ బాండవ రాజ్యేందిరాసంశ్లేషణసౌఖ్యాంబుధి నోలలాడునపుడు—

కర్ణ—ఇంద్రమహేంద్రజాల ప్రజ్ఞాధురీణుండవగు నీవు తలంచుటయు నది కాకుండుటయునా ?

సౌబ—(సుయోధనునివైపుకి) సుయోధనా ! తెలిసినదా ! మన లేఖాప్రభావము. వచ్చినప్పటినుండియు పాపము ధర్మజుఁ డెన్నఁడులేని ప్రణయము నీదెసఁ జూపుచు, నిన్ననుసరించుచున్నాఁడు.

దుర్యో—అగు నట్లే. (కర్ణునిఁజూచుచు) అంగరాజా ! నీవేదో యొకవిధముగ నున్నాఁడవు ?

కర్ణ—కొంచెము శిరోవేదనముగ నున్నది.

దుర్యో—అట్లయిన నొక్కింత విశ్రమింపుము.

కర్ణు అట్లే చేసెదను.

(నిష్క్రమించుచున్నాఁడు)

సౌబ—కుమారా! పాండవులిచటికివచ్చినపిదప రాత్రి మన మనుకొనిన విధంబుననే ప్రవర్తింపవలయునుసుమా?

దుర్యో—అదియే భావించుచున్నాను. నీవు సందేహింప నక్కఱలేదు. మాతులా! విదురజనకులకుఁ దెలియనీయక పాండవుల నేవురమాత్రమే సభారంగమునకుఁ దోడ్కొని రమ్మని దుశ్శాసనునిఁ బంపియుంటిని. వారేలొకో యింకను రాకున్నారు?

సౌబ—వచ్చుచుండవచ్చును.

భటు—(ప్రవేశించి) జయము సార్వభౌములకు. పాండవేయులతోఁగూడ యువరాజుగారు విచ్చేసియున్నారు.

సౌబ—ప్రవేశపెట్టుము (దుర్యో— దీర్ఘాలోచనానిమగ్నుడైనట్లు నటించుచు నొకమూల యాసనముపై గూరుచుండును.

(దుశ్శాసనునితో పాండవులు రంగముంబ్రవేశించుచున్నారు)

సౌబ—(ఎదురేగి) రండు.

(తీసికొనివచ్చుచు)

ప్రవేశోత్సవ సంక్షోభమున మీరీ సభాభవనమును జక్కఁగ తిలకించియుండరు. కావున సావధానముగ బరికించెదరుగాక.

(పాండవులందరన్నిపైపుల దిలకించుచుందురు)

ధర్మ—(తిలకించుచు) ఆహా! ఏమి యీ కమలాకరకల్పనా వైదగ్ధ్యము?

సీ. నవరస స్ఫురితంబు నానావిధవిచిత్ర
కల్పనానల్ప వికస్వరంబు
ప్రకృతిసల్లలితంబుఁ బంకజాదికవృత్త
సందోహ నిస్తంద్ర సుందరంబు
భావప్రపూర్ణంబు ప్రతిపదధ్వానాతి
మంజులతాశ్రుతి రంజకంబు
కవిరాజ సేవ్యంబు ఘనమనశ్శేణికా
హర్షసంజనిత ధారాకులంబు
లలిత నైసర్గికాత్మ హాసోలావిలాస
చయ విమోహిత సరసరాజన్య మగుచుఁ
జెలువు లొలికించు నీ సరసీలలామ
మాన్యచారిత్ర సత్కావ్యకన్యవోలె.

సౌబలా! ఈ శిల్ప మతిమనోహరమై యొక్కొకచో మయసభంగూడ దిరస్కరించుచున్నదిసుమా!

సౌబ—ధర్మజా! ఇది నీ సౌజన్యమునకుఁ దగినమాటయేకాని దీనికిని దానికిని యెక్కడిపోల్కి. అది మయబ్రహ్మసృష్టి. ఇది మానవానుకరణము.

(దుశ్శాసనుని గనుగీటును.)

దుశ్శా—సోదరులారా, భీమార్జున నకుల సహదేవులారా! చూడఁదగిన మనోహర వస్త్రప్రదర్శనము లావైపునఁ బెల్లుగాఁగలవు. పోవుదము రండు.

భీ-అ-న-స:—అట్లే.

దుశ్శా—రండు. దుశ్శా-భీమ-అర్జు-న-స.

(ఇంకొకవైపునకు నిష్క్రమించెదరు)

సౌబ—ధర్మజా! నీ విచ్చటికి విచ్చేయుటంజేసి శాంతన వుండును ధనురాచార్యుండునులేని కొరంత సుంతయుఁ దోపదయ్యె.

ధర్మ—మామా! ఇది నీయభిప్రాయముగాని, వారులేని కొఱంత మరియొకవిధముగఁ బూరింపందగినదికాదు.

భటు—(ప్రవేశించి) జయము సార్వభౌములకు. ద్వారమున గాయకులు వేచి— —

దుర్యో—(కటువుగా)గాయకులు గీయకు లిప్పుడవసరము లేదు వెడలిపొమ్ము.

భటు—చిత్తము.

(భీతితో నిష్క్రమించుచున్నాఁడు)

భటు—(ప్రవేశించి) నట్టువకత్తెలు ద్వారమున

దుర్యో—(తీక్ష్ణదృష్టితో) నట్టువకత్తెలు (చిరాకుగా) ఈనాఁ డెవ్వరికిని యిందుప్రవేశములేదు. వెడలిపొమ్ము. పొమ్ము.

భటు—(భీతితో) చిత్తము, చిత్తము. (నిష్క్రమము.)

ధర్మ—(విని, స్వగతము) ఏమిది? దుర్యోధనుండు కుపితుండై నట్లున్నాఁడు. ఇది ఏదేని యుత్పాతమునకు నాందికాదు గదా? ఈతనిపైఁ ఖరిం జూడ పితామహుని లేఖాంశములు జ్ఞాపకమునకు వచ్చుచున్నవి. ఎట్లైనఁగానిమ్ము. ఈ స్థితి నుండి యీతని మఱలించుటయే శ్రేయస్కరము. (ప్ర) సోదరా!

(దుర్యో. తదేకధ్యానము నటించుచు పలుకకుండును.)

ధర్మ—(స్వ) తప్పక యీతఁడెద్దియో దురాలోచనము సేయుచున్నాఁడు. ఇప్పుడుపేక్షించిన భీష్ముని యాదేశమునకుఁ దప్పినవాఁడ నగుదును. (దుర్యోధనుని భుజముపైఁ జేయి వైచుచున్నాడు. (దుర్యో. ఉలికిపడిలేచి)

దుర్యో—(చూచి) అగ్రజా! నన్ను బలుకరించితివా? నిలిచితివేల? ఈ యాసనముపై నుపవిష్టుఁడ వగుము.

సౌ—(స్వ) మంత్రము బాగుగనే పారినది (ప్ర) సుయోధనా! ఇప్పుడు మేలొ్కనుచున్నావా?

ధర్మ—సోదరా! నీవెద్దియో యోజించుచున్నావు. నే నీ సభాభవనమును సావధానముగ దిలకించియున్నాఁడను. ఈ రచనాచమత్కృతి మిక్కిలి వర్ణనార్హము. ఇందే మేని వినోదములఁ బ్రొద్దుపుచ్చ నిచ్చవొడముచున్నది.

దుర్యో—అగ్రజా! క్షమింపుము. నేఁడు నా కేవినోదముల యందును మనసు వారుట లేదు.

సౌబ—ధర్మజా! నీ కేవినోదము పై నభిప్రాయము?

ధర్మ—నా కెద్దియైనను సమ్మతమే. దుర్యోధనుని యభిమతము ననుసరింతమని.

సౌ—సుయోధనా! ధర్మజుని కోర్కెను మన్నించుట నీ ధర్మము.

దుర్యో—ఔచితి నెఱుంగనివాఁడనుగాను మామా! నేఁడేమో చిరాకుగా నున్నందున నట్లంటిని. (ధర్మజునివైపు తిరిగి) అగ్రజా! మన్నింపుము. కలతవారిన మనసున కే వినోదమును రుచింపదు అయినను పెద్దల కోర్కె మన్నించుట పిన్నవారి విధియగుట రాజపుత్రోచితంబులగు ఖేలనంబులతోడనే యానందింతము. తురంగంబుల నడిపించుటయందును మార్బలంబుల రూపుమాపుటయందును దోలుత ని న్నెన్ని యొరునిఁ జేర్కొనవలయును. కావున నే యుధిష్ఠిర నామము నీయందు సార్థకమైయున్నది. మఱియు నరువదినాల్గు కళలలో నొకటియగు ద్యూతకళయందును నీ వసమాన ప్రతిభావిశేషుండవని విందును. దాని మర్మములు గొన్ని నీవలన దెలిసికొనవలయునని చిరకాలము నుండియుఁ దలంచుచుంటిని. కాకతాళీయముగ నేఁ డట్టి యవకాశము లభించె కావున నేఁడు చతురంగ ద్యూత ఖేలనములతో నానందింతము.

ధర్మ—(స్వ) కట్టా! అనర్థదాయకంబగు ద్యూతమునుగూర్చి ప్రస్తావించుచున్నాఁడే! (ప్ర) సోదరా! చతురంగ ఖేలనము సందేహింపఁదగినది కాదుగాని ద్యూతముమాత్రము కూడని పని, అనర్థదాయకము.

సౌ—కుమారా! పరస్పర వైషమ్యము గలవారిపట్ల నీ వనినది చెల్లినఁ జెల్లును గాని యుబుసుపోకకు వినోదార్థ మాడు కొను నన్నదమ్ములయెడ నది పోలదు.

దుర్యో—అగ్రజా! ద్యూతమర్మములు నే గ్రహించుట నీ కిష్ట ములేకున్నఁ బోనిమ్ము. బలవంత మేమియును లేదు.

ధర్మ సోదరా! నాకు సమ్మతము గాక కాదు. దానివలనఁ బరస్పర మీర్ష్యాసూయలు ప్రబలి దురంతములగు ననర్థ ములు బొడముచుండుటచే బుధులు ద్యూతమనిన గర్హించుచుందురు.

దుర్యో—వినోదార్థ మాడుకొనుట కింత సంశయమేల? బుధ సమ్మతముగాని పురాతనాచారము కలదా?

ధర్మ—(స్వ) ఎంతవారించినను వినునట్లు లేదు. ఇప్పు డీతనిం బోనిచ్చితినా కర్ణదుశ్శాసనులం గూడికొని ఏదేని దురా లోచనకుం గడంగు నేమో? అట్టిదాని కవకాశ మొసంగ వలదనికదా భీష్ముని యాదేశము.

దుర్యో—అగ్రజా! యేమి యోజించుచున్నావు?

ధర్మ—ఏమియునులేదు. ద్యూతఖేలనమున నీ కంత కుతూహల ముండిన నే సమ్మతింపకుండుట సరసలక్షణము కాదు. తొలుత నేది ప్రారంభింతము?

దుర్యో—తొలుత చతురంగమును ప్రారంభింతము.

ధర్మ—(స్వ) ఇది కొంతవర కనుకూలముగనే యున్నది. (ప్ర) సరియే.

సౌ—సుయోధనా ! ఇంక నీవు ద్యూతకళా నిపుణుండ వయ్యెదవు కాఁబోలు.

దుర్యో—ఇంతవఱకు సరిగా పాచికలు చేతపట్టుటయే యెఱుంగని నే నప్పుడే ద్యూతకళావిశారదుండ నైతినని భావించుచున్నావే. మాతులా ! ఎంత చూపోపవేమి ? (ధర్మజునిఁ జూచుచు)

(ధర్మజునివైపు తిరిగి) అగ్రజా ! ఖేలన మొనరించుచున్నప్పటికంటె తటస్థముగ నుండి చూచుచున్నప్పుడు ఆటలోని మర్మములను గ్రహించు టతిసుకరము కావున నే నూరక చూచుచుండెదను. మాతులుండును నీవును ఖేలన మొనర్పుఁడు.

సౌబ—మాటవరుసను నే నన్నందుల కిది బహుమానమా? ఈ భారము నాతలపైఁ బెట్టి నలుగురిలో నన్ను బరిహాసపాత్రుని జేయనెంచితివా ? ధర్మజుని యక్షవిద్యాదక్షతఁ దలంచికొనిన, నామాటయేమి ? యక్షవిద్యయం దారితేరిన వారలకే యీ గండము గడచు టెట్లాయని దిగులు జనింపకమానదు.

దుర్యో—మామా ! (శకునిభుజము తట్టుచు) సామర్థ్య ముండినను లేకున్నను కొద్దియో గొప్పయో ఆకళ నభ్యసించినవాఁడని ప్రశంసింపఁబడువాఁడ వీ యాస్థానమున నీవొక్కరుండవే కదా ? కావున మారుమాటాడక నా కొఱకై నీ వీపనిఁ బూనవలయు.

ధర్మ—సుయోధనా ! సౌబలుఁ డాడునా ?

దుర్యో—అనుటవలన నర్థము.

సౌబ—రాజ్యవైభవాదుల తనతో సమానస్కంధత లేదని.

దుర్యో—ఆ సంశయ మక్కఱలేదు. అగ్రజా! ఆతఁడోడిన వన్నియు నేను నీ కీఁగలవాఁడ.

ధర్మ—మాటవరుసను సౌబలుఁ డాడునాయంటినిగాని, పణముల విషయమైకాదు. సుహృద్ద్యూతమున కెవ్వరాడిన నేమి? దీనికిఁ బణము లెందులకు?

దుర్యో—పణములులేని దాటకు రక్తియుండదు. ఇంకఁబోవుదమా? ఎవఁడురా అక్కడ?

భటు—(ప్రవేశించి) సార్వభౌమునియాజ్ఞ-

దుర్యో—నీ వేగి సకలరాజచక్రమును గృహాశ్వత్థామలను దోడ్కొని రమ్ము.

భటు—చిత్తము. దేవరయాజ్ఞ.

(నిష్క్రమించుచున్నాఁడు)

సౌబ—(పోవుచున్నభటునితో జనాంతికముగ) విదుర ధృతరాష్ట్రుల కీ విషయమును దెలియనీయకుము. పొమ్ము.

భటు—చిత్తము. (పోవును.)

దుర్యో—ఓరీ సేవకా!

భటు—(ప్రవేశించి) చిత్తము.

దుర్యో—భీమార్జున నకుల సహదేవులును యువరాజుగారును నావైపున నున్నారు. వారిని ద్యూతరంగమునకుఁ దోడ్కొనిరమ్ము.

భటు—మహాప్రసాదము. (నిష్క్రమించును)

ధర్మ—(స్వ) వినోదమున కాచార్యులుమాత్ర మెందుల కాక్షేపించెదరు?

దుర్యో—అగ్రజా! మాతులా! రండు.

(నిష్క్రమము)



## ద్వితీయ రంగము

స్థలము : ఉద్యానవనము

(ద్రౌపదీ వాసంతికలు ప్రవేశించుచున్నారు)

ద్రౌ—వాసంతికా! ఈ యుపవనవిశేషముల నెల్ల కనులపండువుగఁ గనుచు, శుకపికశారికాదుల కలకల ధ్వనులు చెవుల పండువుగ వినుచు నింతదనుక విహరించితిమికదా? విహారాయాసముదీర నీ లతామంటపమున నొక్కింత విశ్రమింతము.

వాసం—అట్లే చేయుదము. (ఇద్దఱునుగూరుచుండెదరు.) దేవీ, ద్రుపదపుత్రీ! (ఇంకొకవైపునఁ జూచుచు) ఉదయమునఁ బూవులతోడను బిందెలతోడను జూచుటకెంతయో సుందరముగనున్న యివ్వనభాగ మిప్పుడెట్లు కళావిహీనమై విపరీతముగఁ గన్పట్టుచున్నదో చూడుము.

ద్రౌ—వాసంతికా! నిముసములో తలంపని వింతలెన్నియో యుట్టిపడుచుండును. మఱల మాయమగుచుండును. సమస్తవైభవోపేతుఁడగు సార్వభౌముఁడు భిక్షుకుఁడగును. భిక్షువు

సార్వభౌముఁడగును. పురం బరణ్యం బగును. అరణ్యంబు పురంబగును. ఇట్టి మార్పుల కెన్నింటికో కారణమై రెప్ప పాటులోఁ బ్రకృతినంతయుఁ దలక్రిందులు సేయఁజాలు కాలస్థితుల దెలిసికొన నెవ్వరివశము? (వినుట నభినయించి) ఈ హంసధ్వనులెచటనుండి(పైపై పుఁజూచుచు) శారదాగ మంబునందలి వెలిమబ్బుపింజలవలె హంసగణంబు లాక సంబు నావరించి ఎంతమనోహరముగ నొప్పుచున్నదే?
( ఇరువురును జూచుచుందురు. కొంచెము దూరములో

శారద ప్రవేశించి)

శార—(స్వ) మహానందమున నుద్యానవనవిహార మొనరించు చున్న యీ దేవికి కర్ణకఠోరంబగు మయసభనోడిన వృత్తాంతము నెట్లు విన్నవింతును? (సమీపించి దుఃఖముతో) అమ్మా! ఈ నిర్భాగ్యురాలివై పొక్కసారి చూడుము.

ద్రౌ—(ఆతురముతో) ఏమే శారదా! (దగ్గరకుఁ దీసికొని) ఎందులకే దుఃఖించెదవు?

శార—ఇంకేమున్నదమ్మా! (దుఃఖించును)

వాసం—నీ కేమి యాపదయో ఊరక దుఃఖించుచుండినఁ దెలియున దెట్లే?

శార—(దుఃఖించుచు) అమ్మగారి కాపదకల్గుట నాకుఁ గల్గుట కాదా?

ద్రౌ—(ఆతురముతో) మా కేమియాపద?

శా—నూతన సభం జూచి వత్తమని నేనావైపునకు బోయితిని.

వా—పోయితివి. అచ్చట నేమాయె ?

శా—నా కచట నొక కంచుకి యెదురై మయసభ యోడుట యాయెనని చెప్పె.

ద్రౌ—(ఆశ్చర్యముతో) మయసభయా ! ఓడుటయా?

వాసం—ఎవరు. ఎవరికి ?

శా—మన మహారాజు దుర్యోధన చక్రవర్తికి.

వాసం—ఎందులకు ?

శార—జూదమాడినందున.

వాసం—అమ్మా ! మన మహారాజేమి- జూదమాడు టేమి ? మయసభ నోడుటయేమి ? నేఁబోయి నిజానిజములు కను గొనివచ్చెద. (నిష్క్రమించుచున్నది).

ద్రౌ—శారదా ! తొలుత నీ జూదప్రశంస యెట్లు కలిగె ?

శా—అమ్మా ! నూతన సభావిశేషము లేమని నే నా కంచుకి నడుగ కొంతవడి సంశయించి నేను తమ దాసి నౌట యెఱింగి రహస్యముగ నిట్లనియె. ప్రొద్దు పుచ్చుట కొక్కంత చతురంగ ఖేలనమొనరింతమని దుర్యోధన మహారాజును వారి యనుచరులును మన మహారాజులును కురువృద్ధులు, గురుజనులు నిండియున్నసభలో చతురంగ మాడుచుండ దుర్యోధన చక్రవర్తివస్తుసముదాయము నంతయు మన మహారాజోడిచికొనియెనట. పిమ్మట జూద మాడఁ దొడంగిరట. దానిలో మనమహారాజోడిచికొనిన వారి వస్తుసముదాయమునే కాక మయసభను సైతమోడి

పోయెనట. ఇది వినుటతోడనే నిలువలేక తమకీ వార్త నెఱింగింప నిటు బరువెత్తితిని.

ద్రౌ—శారదా! దీనికేనా! ఇంత సంతాపపడుచున్నావు? నిజముగ మఱిది కా మయసభయే కావలయునన్న మాట మాత్రము వర్తమానంపిన మన సార్వభౌముఁడాతనికాసభ నొసంగుటకు వెనుదీయునా? ఈ భాగ్యమునకు జూదమాడి దాని నోడిచికొనవలసిన యావశ్యక మేమి? వారు వినోదార్థ మాడుకొనుచుందురు. మరల మన మయసభ మనకు వచ్చునులే! దిగు ల్పడకుము.

(వాసంతిక అత్యాతుర దుఃఖములతోఁ బ్రవేశించి)

వా—అమ్మా! రక్షింపుము. రక్షింపుము. (ద్రౌపదికాళ్లపై బడును.) (ద్రౌపది లేవదీయుచున్నది.) అమ్మా, మన శారద చెప్పినదంతయు నిక్కమే.

ద్రౌ—(ఆతురతతో)- పై విశేష మేమి?

వాసం—అమ్మా! నేఁబోవునప్పటికి మన మహారాజు రాజ్య వైభవాదులనేగాక చిన్న తమ్ముని సైత మొడ్డి యోటు వడియె.

ద్రౌ—(సంభ్రమముతో) ఆ. ఆ. చిన్నతమ్ముని.

వా—చిన్నతమ్ముని నోడితిననిన రోషముచేత నకులార్జున భీమసేనమహారాజుల నొడ్డి యోడె. (ద్రౌ. భయసంభ్రమ దైన్య దుఃఖములతో నిస్తబ్ధయగుచున్నది.)

శార—తలవనితలంపుగ నెంతవారి కెంతలో నెంత ముంచి కొనివచ్చినదే వాసంతికా! (దుఃఖించును.)

వా—ఇంతలో నా శకుని శనిగ్రహమువలె మన మహారాజు నెత్తిపోడుపు మాటలచే మరింత నొప్పించుచు యీ మారు పందెమును నీవే గెలిచిన నీ రాజ్యవైభవాదులను నీ నలువురు సోదరులను నీ కిచ్చివేయుదుమనియె. తమ్ముల నైన దక్కించుకొనఁ దలంచి మన మహారాజు తనంతఁ దా నొడ్డుకొని యోటుపడె. (ద్రౌపది సోలి పడిపోవును.)

శా—వాసంతికా! వాసంతికా! దేవిప్రాణములు కడఁ బట్టినట్లున్నవే! ఆ కేళాకూళిలోని చల్లని నీరు గొనిరావే? (ద్రౌపదితలను దనతొడపై బెట్టుకొని వాసంతిక తెచ్చిన జలమును ద్రౌపది ముఖముపై జల్లగా ద్రౌపది కొంచెము తేరికొనుచున్నది. (శా. వా. దుఃఖింతురు.)

వాసం—శారదా! ఊరడిల్లుము. మనమే దుఃఖించుచుండిన దేవి కూరట నెవరు కల్పింతురే?

ద్రౌ—(కొంచెము తెలివితో) నేను నిదురించుచున్నానా? మేల్కని యున్నానా? నేను ద్రౌపది నగుదునా కానా? కాకున్న సంశయ మెట్లు కలుగును? అయిన నింత విభ్రమమేల! ఇంత వికార మేల? సకలధర్మవిశారదుండై న్యాయాన్యాయవిమర్శనాకుశలుండై భరతకులాలంకారుఁడైన ధర్మజ సార్వభౌముఁడు జూదమాడ నీయకొనుట విభ్రమము కాదా? ఆ కౌరవకులాపశదులు మొదటినుండియు పాండుకులోన్మూలన మొనర్ప బ్రయత్నించుచుండు టెఱింగియు సుహృద్భ్రాత మనినంతనే చక్కైరపూఁత విషంబులగు వారి మాటలు నమ్మి జూదమాడ నీయకొనుట విభ్రమము కాదా! పాండవ కులాపకారిమైె

ఆజన్మశాత్రవుండగు దుర్యోధనునకు మేనమామయై దుష్కృతపుం డైన యా శకుని పోటుమాటల కులికి ఆతనితో జూదమాడనీయకొని సోదరుల సైతము పణంబు సేయుట విభ్రమము కాదా? అది మహాసభ కదా? అచ్చటి కురువృద్ధ గురుజనంబులలో నొకరైనను ధర్మమూర్తివగు నీ వీ పాపకృత్యమున కీయకొనం దగదని మా సార్వభౌము సేల వారింపరాదు? అందరును కౌరవ పక్షపాతులే యైరా? కాకుందురా! కానికాలము వచ్చినపుడు వారికిమాత్రము నో రెట్లాడును? కాలమా! నీ గర్భపేటికయం దెంత లెంతలు కౌటిల్యములు దాగి యుండును? క్షణములో మానవ ప్రకృతులకు నీ వెట్టి వైకల్యములను గలుగఁజేయుదువు. నీ చైదములు దుర్వర్ణనీయములుగదా! ఏ రాజన్యచూడామణుల పరాక్రమ తేజఃపుంజములు శాత్రవహృదయసంవృతగర్వాంధ తమస్సును పటాపంచలు గావించు దివ్యజ్యోతిఃప్రతానములయ్యెనో? ఏ శౌర్యధనుల ప్రచండప్రతాప వైశ్వానరజ్వాలామాలికలు దివి కెగఁబ్రాకి దేవతా సార్వభౌమతాపహేతువులయ్యెనో, ఏ విశ్వేశ్వరుల నిర్మల ధర్మచంద్రికావిసరంబు అనిమిష మర్త్యపన్నగ జగన్నివాసుల మనఃకుముదంబుల వికసింపఁ జేసెనో ఏ చక్రవర్తుల నిర్వక్రవిక్రమం బఖిలానిమిష మర్త్యరాక్షసస్తవనీయమహారాజసూయాధ్వర నిర్వహణకారణం బయ్యెనో అట్టి నా ప్రాణనాథులు నాకుఁ గానివారైరా? ఇట్టి దుర్గతికి మూలము మా వైభవమే కదా? హా!

హాతవిధీ! నిర్మలధర్మరతులగు పాండుపుత్రులపైననా నీ కింత దురాగ్రహము? త్రిభువనస్తవనీయులగు దిక్పాలురకు ప్రియతములే! సకల సూరిజనానందకారణంబగు మహారాజసూయాధ్వర నిర్వాహకులే! సృష్టిస్థితి లయకారణభూతులగు ముమ్మూర్తులకు వందనీయుండైన శ్రీకృష్ణపరమాత్మకుఁ బ్రాణాధికులే! అట్టి వారలనా? నీవీ నీచద్యూతమున దింపుట! దింపి యోడించుట? ఓడించి నాకీయార్తినిఁ గల్పించుట? వస్తువాహనములు పోయిన వగవను. లోకోత్తరంబగు మయసభ పోయిన విచారింపను. సకల కామితముల నొడఁగూర్చు పూజ్యసామ్రాజ్యముపోయిన రవ్వంతయైన మది కలఁత నొందను. ఏది ఏమైపోయినఁ జలింపను. తుదకు ద్యూత మృత్యువునకు నే నాహుతియై యుండినను దుఃఖింపను. నా ధనము, నా ప్రాణము, నాసర్వస్వమునైన నాజీవితేశ్వరులు ఒక రాజనామమాత్రుఁడు. ఋజుమార్గపద్ధతివిహీనుఁడు. పరవైభవాపహరణ లంపటుఁడు, భ్రాతృద్రోహి, మానవాధముఁడును నగు దుర్యోధనునకుఁ జరణదాసులగుటకు వగతును. తపింతును. ప్రాణపరిత్యాగమొనరింతును. (నిండుదుఃఖమున వికృతముగఁ జూచుచు) నీచ దాస్యనామకమహానరకకూపమునంబడి నా హృదయవల్లభులు నాకుఁ గానివారైరా? నా జీవితేశ్వరులు నాకు లేరా! హా ధర్మజా! హా భీమసేనా! హా అర్జున, నకుల సహ... (మూర్ఛిల్లును.)

(యవనిక పడును.)



## తృతీయరంగము.

స్థలము : ద్యూతసభ - పాండవులు, దుర్యోధన, దుశ్శాసన, సౌబల, కృపాశ్వత్థామలు, కొందరు రాజులు, ప్రాతిగామి, భటులు.

సౌబ—ధర్మజా! ఏమట్లు దీనాననుండవైతివి. ఓటమి కలిగిన చింతించు టాటగానిలక్షణము కాదు. నీకేమైన పందె మొడ్డుటకున్న నొడ్డుము. లేకున్న నాట చాలింపుము. చింతించి ప్రయోజనము లేదు. (జనాంతికముగ దుర్యోధనునితో) విదురుఁడు వచ్చుచున్నాఁడీతని కెట్లు తెలిసె? ఒక్కఁడేవచ్చె నిది కొంత మేలే !

దుర్యో—(సౌబలునితో జనాంతికము) జనకునకుఁ దెలియకుండున ట్లేర్పాటుచేసితిని కాని, ధర్మజుని వారించి యీతఁడు కార్యభంగము గావింపఁడుగదా ?

సౌ—(జనాంతికము) ద్యూతలంపటున కెంతటి హితమైనను విషప్రాయముగును.

(విదురుఁడు ప్రవేశించి సభ కలయంజూచి)

విదు—(తలయూఁచుచు స్వగతము) నేను భటునివలన దెలిసి కొనిన దంతయు వాస్తవమే. (యోజించి) సందేహము లేదు. ధర్మజుని వంచించుటకై పన్నఁబడిన పన్నుగడ. (యోజించి) ఏమిసేయుదు? ఇది తగవుగాదని దుర్యోధనుని వారించెదఁగాక (ప్రకాశము) నాయనా ! దుర్యోధనా !

దుర్యో—ఏమి కొంపమునిఁగినది?

విదు—నీ వీ దుష్కృతిని మానకుండిన కొంప మునుగుటయె కాదు. జగంబే మునుంగును. దుర్భరపరాభూతి ధర్మమును సైత మతిక్రమింపఁజేయుట సహజము. కుమిలి కుమిలియున్న అగ్ని యొక్కసారిగ గప్పుమనక మానదు. పాండవేయుల పరాక్రమం బనివార్యము. ఓ దుర్యోధనా !

సీ॥ ప్రళయకాలాభీల భాస్వన్మహాకాల
సంరంభ మొకవేళ సైపవచ్చు
విలయవేళావిజృంభిత మహాబల తీక్ష్ణ
నిహతి కోర్కించుక నిలువ వచ్చు
త్రిజగద్భయంకరోద్ధృతి దుర్నిరీక్షమా
దంభోళి కొక్కింత తాళవచ్చు
సంవర్తసమయ ప్రచండ హాలాహలా
త్యుగ్రకీలాపాళి కోర్వవచ్చు
గాని సైపంగవచ్చునే కదనరంగ
చండదోర్దండ మండిత మండలాగ్ర
ఖండితోద్దండ వైరిప్రకాండకాండ
బలవ దంతకసుత భీమపార్థయమళ.

అక్రమంబుగ మహోత్సాలం బ్రతారించి వృద్ధిఁ బొందిన వారెవ్వరును లేరు.

సీ॥ నలుని మోసమొనర్చి గెలుపుఁ గైకొనిన యా
పుష్కరుం డెంతఁగా పొలుపుమీఱె ?
అలహరిశ్చంద్రు బాముల పాలుఁ జేసిన
గాధేయుఁ డెంతటి ఘనతఁగాంచె ?

ఇనకులాధీశ్వరు హింసింప నెంచిన
దశకంఠహతకుఁ డెంతగ రహించె?

నీలనీరదగాత్రు నిర్జింపజూచిన
యాకంసుఁ డెంత నిర్వ్యాకమయ్యె

ధర్మ కర్మావలంబ నిస్తంద్ర సత్య
వాక్యపరిపాలనైకసంభవ దిగంత
దంతురానంత కీర్తి భాస్వంతులైన
ఘనుల నేచుట స్వవినాశకరముగాదె?

ఇంతటనైనను బరమపావనమూర్తి యగు నా ధర్మజుని రాజ్యవైభవాదు లాతనికి సమర్పించి ఆ యనఘుని కాళ్లంబడి, అగ్రజా! అజ్ఞానవశంబున నాచేసిన యపరాధమును గృపామతి క్షమియింపుము" అని వేడికొని నిన్ను నీవు రక్షించికొనుము. కురుకులంబును రక్షింపుము. దూరాలోచనము చేయుము.

దుర్యో—విదురా! నీ హితోపదేశ మింకఁజాలు? నేఁజేయునది అధర్మకృత్యముకాదు. కాన నాకేమియు భయము లేదు. కురుకులంబున కంతకంటెను భయములేదు. జ్ఞానలవదుర్విదగ్ధుండవగు నీ మాటలు వినవలయునా? ధర్మజుని కాళ్ళపయిం బడవలయునా? ఎందులకు? జూదమాడుటధర్మమనియా! అది రాజధర్మవిరుద్ధము కాదు. నే నపరాధి ననియా? స్వధర్మనిర్వహణపారీణుండను నే నపరాధినిగాను. ధర్మజుండు న్యాయమార్గంబున నాకోటు వడియె. జూదమాడుమని నే నాతని నిర్బంధింపలేదు. పోని

మిప్పటికైన మునిఁగిపోయిన దేమి ? నీవనిన ట్లపరధర్మ మూర్తియగు నీధర్మతనయుండే 'ఇదంతయు నధర్మము, జూదము నే నాడుదు ననలేదు' అనినఁ జాలును. ఈ క్షణం బున రాజ్యవైభవాదులతో సోదరచతుష్టయముతో నాతని వదలివేయుటకు నాకే యభ్యంతరమును లేదు. నీ వింక ననవసరప్రసంగమునఁ గార్యభంగము గావింపకుము. ఉత్సాహభంగము సేయకుము.

విదు—ఉత్సాహభంగమా ! నీ గెలుపువలనఁగదా నీకింత యుత్సాహము కలిగినది. ధర్మజుండే గెలిచి నీవే యోటు వడిన నీమనంబెంత సంతాపమును బొందెడిదో యొక్కింత యూహసేయుము నీవు నీ ప్రాణాధికమగు నీ సోదరశతంబు ఆత్మగౌరవమును వీడి నిజౌద్ధత్యమును బరిత్యజించి నీచ సేవక జనంబునకంటె హీనంబుగ ధర్మజుని కనుసన్నల మెలంగు పరిచారికలకు పరిచారికలుగ యూడిగ మొనరింప వలసివచ్చినప్పుడు మీరుపడు సంక్షోభ మెట్లుండునో యొక్కింత చింతసేయుము. దుర్మదంబునఁ బరులకు బాధ కలిగించుటకాదు. అట్టిబాధయే తమకు సంప్రాప్తమైన పుడు తమస్థితియెట్లుండునో తెలిసికొనుటయే దొడ్డతనము.

సౌబ—విదురా ! (చిరునవ్వుతో) ఇంతయోటమి కలిగిన ధర్మజున కెట్లయినను నీకుమాత్ర మెక్కడలేని మనఃక్షో భము కలిగినట్లున్నది. పాపము నీ కెంతమల్లక్రియ కారణ సంక్షోభము. ఎవ్వరిమనంబు లెవిధమైన పశ్చాత్తాపమున గ్రుక్కకుండ ధర్మజుండే గెలువవలయు ననెడి నీ యభీష్టము నెఱవేఱునట్లు నే నొక మార్గము [illegible].

(ధర్మజుని దిక్కు మొగంబై) ధర్మజా! ఈ మారొక్క పందెము పెట్టుదము. ఇయ్యదియే కడసారి పందెము. ఈ మాఱు నీవే గెలిచిన నీ విదివఱ కోడిన సమస్తమును నీ కిచ్చివేయుదును. పాపము నీవంతయు నోడితినని దిగులొందినట్లున్నావు. (దుర్యోధనునిఁ జూచుచు) ఏమి దుర్యోధనా! నీయభిప్రాయము.

దుర్యో—నేనును నాసోదరశతంబును ధర్మజునకు దాసులమైనపుడు మా సంక్షోభ మెట్లుండునో గమనింపుమని కదా! ఈ విదురుండు వాక్రుచ్చె. మంచిది. శ్రితజన వాంఛాప్రదుండనగు నే నేల యీతని యభీప్సిత మీడేర్పకుండవలె. ఈ పందెమును ధర్మజుండే గెలిచిన నేనును నాయాజ్ఞానుసారము నా సోదరశతంబును ధర్మజునకు దాస్యంబు సలుపుదుము. ఇదియే నా ప్రతిన.

సౌబ—ధర్మజా! దీని నొప్పికొనిన నీకు లోపములేదు. జూదమున నెక్కుడోటమి ప్రబలజయసూచకము. నీ వీ సంతాపమున మఱపొందితివేమో? సంకోచింపకుము. దైవముపై భారమువైచి ధైర్యము తెచ్చికొనుము. లేదా! ఇంక నే నాడఁజాల నను. ఏమనియెదవు?

ధర్మ—(స్వ) గెలుపనునది నాకు గగనకుసుమమైనదికదా? (యోజించి) ఈ పందెమువేసి చూచిన నెట్లుండునో? "సాహసాద్భజతే లక్ష్మీః" సోదరుల బంధవిముక్తికై ద్రౌపదినైనను నొడ్డుటకే నామనం బంగీకరించుచున్నది.

సౌబ—ధర్మజా! ఏమి యోజించుచున్నావు?

ధర్మ—సౌబలా ! నాధనము, నా ప్రాణము, నా సర్వస్వము ననఁదగిన ద్రౌపదియేకదా నాకింక మిగిలియున్నది ? ఆమెనేకదా పందెమిడవలయు ?

సౌబ—పందెమిడవలయునా పందెమిడినాఁడవా ?

ధర్మ—సౌబలా !

సీ॥ పాంచాలరాజగర్భము పావనతఁగాంచ
నవతరించిన సుగుణాలవాల

లలిత భారతకీర్తిలతకు నాధారమై
నిలిచిన సంస్తవనీయచరిత

అభిజాత్యోచిత వ్యాపారములకెల్లఁ
దలమానికంబుగా వెలయు సాధ్వి

పరమపాతివ్రత్యసరణి ననన్యయై
ఖ్యాతిఁ గైకొన్న మూర్ధాభిషిక్త

నిఖిలలోకైక సంస్మరణీయ దివ్య
విమలవర్ణ విరాజత్పవిత్రనామ
అఖిల పాండవపంచకార్ధాంగలక్ష్మి
సరగఁ బణమయ్యె యమతనూజాతునాజ్ఞ.

సౌబ—ధర్మజా ! పందెమును నీవే వేయుదువా? నన్ను వేయమందువా ?

ధర్మ—ఎవ్వరు వేసిననేమి, పోనిమ్ము. నేనే వేయుదును.

(పందెమునువేసి ఖిన్నత వహించును.)

సౌబ—సుయోధనా ! పాండవరాజ్యలక్ష్మితోఁబాటు పాండవేయార్ధాంగలక్ష్మియు నీ కరగతంబయ్యె.

దుర్యో—విదురా ! (చిరునగవుతో) పాపము. నీయభిమతం బీడేరక నేపోయెగా? పదచలనంబులేక, రథగజతురగపదాతి సైన్యసందోహంబుల నపేక్షింపక ఒకరి శరీరమున కలసట కలిగింపక మయసభ కధిపతినైతిని. పాండవసామ్రాజ్యలక్ష్మి కధిపతిని నేను, పాండవేయుల కధిపతిని నేను, పాండవేయార్ధాంగలక్ష్మి కధిపతిని నేను. ఇంతకన్న నేను పొందదగిన మహాభాగ్యమేది? ఇంతకన్న నే ననుభవింపఁదగిన మహానంద మెయ్యేది? ఇంతకన్న సుక్షత్రియుండగు వాఁడు! కోరఁదగిన యుత్తమపదం బెయ్యేది! ఇట్టి కురురాట్శేఖరుని విజయంబునకు నీ వేమనియెదవు?

విదు—ఓయీ ! మూర్ఖజనాగ్రేసరా ! ఇదియును నొక విజయంబనియే సంతసించుచున్నావా? గర్భీభూత హాలాహాలంబగు శర్కరాపూపంబు మ్రింగునప్పుడు జిహ్వకెంతయో రుచ్యముగ నుండునుగాని యది కడుపునం దిమిడి ప్రేవులు తఱుగుచున్నపుడుగదా దానిబాధ తెలియును? "మహానదీప్రతరణం మహాపురుషనిగ్రహం, మహాజనవిరోధంచ దూరతః పరివర్జయేత్" అని ప్రాజ్ఞుల నీతి. నీముఖప్రీతికై (శకునిఁ జూచుచు) ఇచ్చకములాడు కుటిలస్నేహితులు వేనవేలు నీకు లభించెదరుగాని అప్పటికి నీ కహితముగఁదోచి నీవాగ్రహించినను వెఱవక నీకు హితము నుపదేశించి సన్మార్గగామి నొనరించు సన్మిత్రుఁ డొక్కఁడు నీకు దొరకుట దుర్లభము, ధర్మమూర్తులగు

భీష్మ ద్రోణు లిరువురు లేనిసమయముం గనిపట్టి యిట్టి ఘోరకార్యమునకుం దలపడితివా ? నీ సంపదలు నీకుఁ జాలక పాండవసంపదల సైతము హరింపవలయు ననెడి తలంపే నీకుఁ గలిగిన రణరంగంబున ధీరుండవై నిల్చి తద్విధార్జిత రాజ్యపదంబున దీపింపుము. దానికెల్ల లోకములు సంతసించు. నూతనసభాప్రవేశోత్సవమున కని వారల నిచ్చటకుఁ బిలిపించి కితవోద్యోగంబున ధర్మజుని వంచించి పరాభూతునిఁ గావించుట నీ యశక్తదుర్జనత్వమును వేయినోళ్ళం జాటుచున్నది. పౌరుషవంతుఁడైన సుక్షత్రియుం డసువులనైనఁ బాయునుగాని యిట్టి నీచ ద్యూతసముపార్జిత రాజ్యపదవికి నీవలె సంతసింపఁడు.

దుర్యో—ఓ యసంబద్ధప్రలాపీ! విదురా! ఇది మాయా ద్యూతముకాదు. కితవోద్యోగంబు లేదు. ధరారమణులకు ధర్మయుద్ధమున గెలుపుగొను టెంతటి పుణ్యప్రదంబో ధర్మద్యూతజయంబును నట్టిద. ఓయీ! విద్వేష త్పుష్టి పాత్రీ! అక్రమంబున శత్రుజయోత్సేకంబు సమకూరుచున్నపుడు శ్రమోపలబ్ధంబగు జయంబు నెవ్వఁ డాకాంక్షించును ? నా విజయంబునుగదా నీవు అక్రమవిజయం బని వాపోవుచున్నావు? మంచిది. ఈ విజయమే ధర్మజుని దైయుండిన నీ వే మనియుండెడివాఁడవు ? అప్పుడు ద్యూతము రాజధర్మమై ఈ విజయము పరమధర్మ విజయమై యుండెడిదేమి? ఇష్టముండిన నెట్టి యధర్మకృత్యములైన పరమ ధర్మస్వరూపముం దాల్చునో? లేకుండిన నెంతటి ధర్మకృత్యములైనఁ గేవల మన్యాయములుగఁ

బరిష్కరించునో? ఇట్లు సెప్పుటకు విధినిషేధంబు లేదో? విస్సన్న చెప్పినదే వేదమనునట్లే కురుసభాంతరాళమున నీవు చెప్పినదే ధర్మమో? స్వధర్మోల్లంఘన మొనర్చిన నీవు ధర్మనిర్ధారకుఁడవో? (తలయూఁపుచు) ఇంటదిని ఇంటివాసములు లెక్కఁడుచుండిన మహానుభావుఁడవు. నీ వేమని ధర్మనిర్ణయము సేయవచ్చితివి. నీ విషపూరితవచనములు వినకుండిన మేము చెడియెదమా! ఎట్లు చెడియెదమో చూచెద. పాండవసంపద నాకెట్లనుభవార్హంబు కాదో కనుంగొనియెద. నాశాసనమున కెవ్వ రాటంకము కల్గింపఁజాలుదురో విచారించెద. నీవు కృతఘ్నుఁడవు. మిత్రద్రోహివి. రాజద్రోహివి. నీయుపదేశమును లక్ష్యము జేసిన మేము కురుకులద్రోహుల మగుదుము. ఇంక నోరెత్తకుము.

ప్రాతిగామీ!

ప్రాతి—ఆజ్ఞ.

దుర్యో—నీ విప్పుడవోయి మా దాసియైన ద్రౌపది నీ సభామధ్యంబునకుఁ దోడ్కొనిరమ్ము.

ప్రాతి—చిత్తము. (ముందునకు వచ్చి) సార్వభౌమశాసనము!

(తలయూఁచుచు నిష్క్రమించుచున్నాఁడు.)

భీము—(స్వ) ఔరా! ఏమి దైవప్రాతికూల్యము? దురాత్ముఁడగు నీ దుర్యోధనపాతకుఁడు యుక్తాయుక్త విచార విదూరుఁడై అయోనిజ, అగ్నిసంభవ, వీరపత్ని, పాండవపట్టమహిషిని సభకుఁ బిలిపించుటయా! అగ్రజుని యాజ్ఞ

ఎంతచేటునకు మూలమైనది ? దుర్భరము. ఇంకను అగ్రజాజ్ఞయా ! ఇంకను పాపభీతియా ! (ప్ర) అక్కటా ! ఏబాధకైన నోర్చియుండనగును గాని అర్ధాంగలక్ష్మి యశ్రుజనపూరితాపాంగముల జూచి యోర్చుట దుస్సహము. ఇంత మనఃక్షోభంబునకు, ఇంతటి దారుణపరాభవంబునకు మూల మీ ధర్మజుఁడే కదా ? ఇట్టివాఁడగ్రజుండైన నేమి ? తండ్రియైన నేమి ? దైవమైననేమి ? ఎవ్వండైన నేమి ? శకలశకలములుగ ఖండించి తీఱవలసినదే. (ఉత్కట క్రోధముతో) ఇంక నిలువఁజాల. ఏ హస్తము పాండవేయప్రాణధనంబగు ద్రౌపదిని పందె మిడియెనో, ఏ హస్తము అయోనిజ, అగ్నిసంభవయగు ద్రౌపదిని పందె మిడియెనో, ఏ హస్తము నిఖిల సామంత సీమంతినీసీమంత రజోభిశోభిత పాదనీరేజయగు ద్రౌపదిని పందె మిడియెనో ఆ హస్తమును ఖండించెద. ఆ హస్తమును విధ్వంస మొనర్చెద. ఆ హస్తమును రూపుమాపెద. (ధర్మజునిపై కురుక అర్జు – నకు – సహా.లు పట్టుకొని)

అర్జు—అన్నా ! కోపావేశమునఁ బ్రపంచమునే మఱచినట్లున్నావే ? ఎంత సాహసము సేయనెంచితివి ?

సీ॥ పాండుభూపాలగర్భపయోధి కెవ్వాఁడు
రహిమించగా శీతరశ్మియయ్యె
వనధిపరీత భూవలయంబున కెవండు
సార్వభౌమత్వముఁ సంతరించె

విప్రపత్రితతయంబు వినుతింపఁగా నెవ్వ
డసమాన రాజసూయం బొనర్చె
జగదేక ధర్మనిష్ఠాగరిష్ఠుండునా
నెవఁడు సత్కీర్తిచే నెసక మెసఁగె

అట్టి శ్రీ పాండుభూపాలకాన్వవాయ
సాధవారాశి రాకాతుషారరశ్మి
సారతరకీర్తి ధర్మజచక్రవర్తి
దండనార్హుఁడె? నీగదాదండమునకు.

శాంతి వహింపుము.

నకు—అన్నా! భీమసేనా! నిఖిలధర్మసూక్ష్మ పరిజ్ఞాతయగు ధర్మతనయుండే ధర్మముం దప్పిన ముల్లోకములును దల్లడిల్లవా! గ్రహరాజంబులు తమ తమ స్థానంబులు తొలంగవా! ఇంతయేటికి జగద్భయానకంబగు మహాప్రళయ మాపాదింపదా?

సహ—అగ్రజా! తొల్లింటినుండియు అగ్రజాజ్ఞయే విధిశాసనంబుగ నొదలిఁదాల్చి యైకమత్యమునకు దార్కాణ పాండుపుత్రులను ఎనలేని కీర్తి నీ జగంబున గడించితిమి. అట్టి కీర్తిలతనుబిట్టపిడుగున నీ యకారణక్రోధాగ్నికింధన మొనర్పఁజూచుట నీయట్టి ధీరాగ్రగణ్యున కుచితంబు కాదు. ధర్మజున కేమైన మనపై క్రోధముండి యాడెనా? దైవప్రేరణము శాత్రవధార్ష్ట్యము. ఎంతటి కష్టసమయము లందైన గాంభీర్యము వీడుట సుక్షత్రియులక్షణమా? తమ్ములనోటువడి తనంతఁదా డీలుపడి ప్రాణాధికయగు

నర్థాంగిని సైత మోడి ముమ్మ్రడించిన దుఃఖాతిరేకంబున దీనాతిదీనాననుండై పట్టజాలక పొంగిపొరలివచ్చు దుఃఖమును గనుగొనల నాపికొనుచు నవనతముఖుండై యున్న ధర్మతనయుని ముకుళిత ముఖకమలము నొక్కసారి కనులార వీక్షింపుము. (ధర్మజునిపై నొక్కసారి చూచి) అవనతముఖుండై భీముం డూర కుండును.)

సౌబ—సుయోధనా! ప్రాతిగామి యింకను రాకున్నాఁడేమి?

దుశ్శా—(చూచి) అదిగో. ఒక్కఁడే వచ్చుచున్నాఁడే!

ప్రాతి—(ప్రవేశించి) సార్వభౌమా! ధర్మజచక్రవర్తి ముందుగ నన్నోడెనా లేక తానే డీలుపడియెనా! అను నీ ప్రశ్నమునకు సమాధాన మా ధర్మమూర్తి నడిగి తెలిసికొనిరా నన్నా ద్రౌపదీదేవి యాజ్ఞాపించె.

దుర్యో—ఔరా! రాజ్యములు పోయినను రాజఠీవి మాత్రము పోలేదనుట సార్థకపఱచినదే! దానికి దేవీత్వము పోయి చాల కాలమైనది. "నీ సంశయముల నన్నిటిని రాజసభామధ్యంబుననే తీర్చికొనవచ్చునని మాఱుమాటాడక సభకు రా సార్వభౌముని యనుజ్ఞయైనది" అని చెప్పి యా దాసిని టకుఁ దీసికొనిరమ్ము. లేనిపోని కుంటి ప్రశ్నలతో కాలయాపన మొనరించిన మానము దక్కదని స్పష్టముగ వచింపుము పొమ్ము.

ప్రాతి—చిత్తము. (ముందునకు వచ్చి తలయూఁచుచు) పాండవపట్టమహిషి కౌరవదాసి. కాలస్వభావము (తల యూఁచుచు) సేవకుఁడను (నిష్క్రమించుచున్నాఁడు.)

అశ్వ—ఏమి యీ ఘోరము? పాండవ పట్టమహిషి కౌరవ దాసియా? ఆమెను నిండుసభ కీడ్పించుటయా! రాకున్న మానభంగమా? ఏమి యీ సాహసము! ఏమి యీ స్వేచ్ఛా సంచారము. ధర్మనిర్ధారకులు లేరా? భరతభూమి నేఁడే పాపభూయిష్టంబు గానున్నదా? లేకున్న నింత దురాచారము పెచ్చుపెరుగునా? ఏనాఁడైన యే నీచ జాతియందైన కులసతిని సభ కీడ్పించుట వినియున్నామా? ఓ ధర్మ నిర్ధారకులారా! ఓ కురువృద్ధులారా! భరత కులాలంకారభూతయగు ద్రౌపదీ దేవి నిట్లు సభ కీడ్పించుట ధర్మమా, అధర్మమా? అను విషయమును మీ రెల్లరుఁ బాక్షికభావ విరహితులరై నిర్ణయించి మహాభిష భీమసేన ప్రదీపశంతనుల నాఁటినుండియుఁ బాపంబన నెట్టిదియో యెఱుంగని యీ భరతకులంబుఁ బాపకూపారమున మునుంగకుండ కాపాడుఁడు. (ఎవ్వరు మాటాడకున్న లేచి కీర్తనఁబాడి) అంతఃపురవాసినిని, పరమ పతివ్రత, పాండవ ధర్మపత్ని ద్రౌపదికి సంభవించిన యీ విషమపరిస్థితికి న్యాయనిర్ణయము సేయకుండుట కురువృద్ధులకు శ్రేయంబు కాదు. ధర్మనిర్ధారకులకు న్యాయంబుకాదు. ఆచార్యులకు సంప్రదాయంబుకాదు. (ఎవ్వరును పలుకరు) ఏల మౌనధారులై యూరకున్నారు? అతిక్రాంత మర్యాదుఁడైన యీరాజు నేఁడు పాంచాలి నవమానించుచున్నాఁడు. ఇప్పట్టున మీ రంద రీ దుష్కృతి కంగీకరించి యూరకుండిన రేపీ యవస్థ మీకే సంభవించును. అప్పుడును మీ రీ విధమున ననదలకై వడి నూరకుండవలసినవారలే

కదా ? ఇట్టి యస్వాతంత్ర జీవనమున మనియున్న నేమి ? చచ్చిన నేమి ? మీ కులగౌరవములం గూలంద్రోయు తలంపే లేకయుండిన మీ యాత్మస్వాతంత్ర్యముల నీ ప్రభువాసంగు నీచదాస్యమునకు వెలవోయు తలంపే లేక యుండిన భరతభూమి పూర్వౌన్నత్యముం గాపాడుతలం పున్న లెండు లెండు. ధర్మసంస్థాపన మొనరింప నడుములు కట్టుఁడు. మోమాటములు వదలివేయుఁడు. సేవ్య సేవక భావములను విసర్జింపుఁడు. పాంచాలి మొఱాలింపుఁడు. స్వాతంత్ర్యము నవలంబింపుఁడు.

విదు—బాగు. బాగు. ఆచార్యకుమారా ! బాగు. స్వార్థ పరత్వమును వీడి కులగౌరవ దేశగౌరవములను బునరుద్ధరింప ముందంజవైచిన మహాత్ముని-నిన్ను దేవతలు రక్షించెదరు గాక. ధర్మజుఁడు దొలుతఁ దానోటువడి పదంపడి నాయమను బణంబుఁజేసెఁగావున ద్రౌపది యధర్మవిజిత.

దుర్యో—అగును. తా నోటువడిన పిమ్మటనే ధర్మజుండు దానిం బణంబుఁజేసె. అంతమాత్రమున నది యధర్మ విజితయా ? ఇప్పటికైనను దానిని వదలివేయుటకు నాకెట్టి యభ్యంతరమును లేదు. ఈ ధర్మజునిచే "భార్యనొగ్గుటకుఁ బురుషుఁ డవస్థాభేదంబున నస్వతంత్రుఁడు" అని యనిపింపుము. లేదా ! ఈ సభాసదుల సమక్షమున "ఓటమిఁజెంది నప్పటినుండియు ధర్మజుండు నాభర్తగాఁడు యని యాబిడచే ననిపింపుము. ఈ రెండుపక్షములలో నేదియైనను నాకంగీకారమే. నీ వనిపింపఁ జాలుదువా ?

దుశ్శా—అగ్రజా ! పాండవుల నెట్లైన దాస్యవిముక్తులను

జేయవలెనని గిలగిలఁ గొట్టుకొనుచున్న యీ విదురుఁడు ధర్మజుని కాళ్లు గడ్డములు బట్టికొనియైన నీ పలికిన ట్లని పించును. ఇంక నా బహుభర్తృక ఎంతకైనను సాహసు రాలే. కాని దుర్యోధనసార్వభౌముని ప్రథమశాసనము నకు విరుద్ధము సంభవింపవచ్చునా ?

సౌబ—(చూచి) ఈమాఱును ప్రాతిగామి యొంటిగనే వచ్చు చున్నాఁడే ?

ప్రాతి—(ప్రవేశించి) ప్రభూ! ఆమె ఏకవస్త్రయట. సభకు రాకూడదట.

దుర్యో—ఏకవస్త్రయా ? అయిన సభకు రా నభ్యంతరమేమి? నీకుఁ దీసికొనివచ్చుట కాటంకమేమి ?

దుశ్శా—"దానిని "దేవిగారు" అనిగదా సంబోధించి యుండె. ఆ దేవి కాగ్రహము కలుగునని భయపడియెఁ గాఁబోలు. ప్రాతిగామీ! సార్వభౌమ శాసనమని యెఱుంగవో ?

ప్రాతి—అయ్యా! నే నపరాధినిగాదు.

దుర్యో—మచ్ఛాసనోల్లంఘన మొనర్చిన నీ వపరాధివిగాక మరేమి ? మతిహీనుఁడా ! ఆజ్ఞానిర్వహణ మొనర్పజాలని యనదవయ్యు నింకను ప్రేలుచున్నావా ?

ప్రాతి—(క్రోధముగల దీర్ఘనిశ్వాసముతో) దుర్యోధనసార్వ భౌమా ! నేను సేవకుఁడ నగుటచేతఁగదా మంచిచెడుగులు దలంపక చిన్ననాఁటనుండి మీయెడ నాకుఁగల భక్తి విశ్వాసములనైన దలంపక యిట్లాడితిరి ? సేవకులకును

నాత్మగౌరవమర్యాదలు కలవు. (ఆవేశముతో) ఇవిగో మీ ఖడ్గచిహ్నములు. (ఖడ్గచిహ్నములను దీసి క్రిందనుంచి) రజస్వలయైయున్న స్త్రీనిఁ దాకుఁ మహాపాపమునకు నేఁ బాల్పడఁజాలను. (క్రూరముగఁ జూచుచు) సెలవు.

దుర్యో—ఓరీ సేవకా!

భటు—(ప్రవేశించి) ఏమిసెలవు?

దుర్యో—మచ్ఛాసనోల్లంఘనమొనర్చిన వీనిని ప్రప్రథమమునఁ గారాగారమున బంధింపుము.

భటు—చిత్తము. (ప్రాతిగామిని రెక్కలుబట్టి నెట్టుకొని పోవును.)

దుర్యో—తమ్ముఁడా! నీవు వోయి దానిం దలవట్టింబాడ్చి కొనిరమ్ము.

దుశ్శా—చిత్తము. (నిష్క్రమించును.)

అశ్వ—ఈ ధర్మనిర్ధారణావసరమున న్యాయైకదృష్టులు మౌనముద్ర వహించుట పాపోపార్జనహేతువు. సతు లెందునను బూజార్హలుగాని పణముల నొనరింపఁదగిన వస్తువులుకారు. కావున ద్రౌపదీదేవి యధర్మవిజితయగుట ముమ్మాటికి నిశ్చయము. నిస్సంశయము. అది యటుండ ఆమె ఏకవస్త్రయట. చండాలులు సైతము స్త్రీ రజస్వలయై యున్నప్పుడు దరియుట పాపమని వెఱతురు. పాపభీతి విరహితుల రగుట మీర లా రజోదూషితయగు మానినీమణిఁ దాఁకినఁదాఁకుదుగాక. మహామహులచేఁ బరివేష్టింపఁబడిన ఈ మహాసభ కెట్లు తీసికొనివత్తురు? తీసికొనివచ్చి ఆజన్మ

పవిత్రులగు నీ సోమదత్త కృపాది కురువృద్ధ గురుజనంబుల నె ట్లపవిత్రులం జేయుదురు? ఎవ్వరిని మీరు నీచాతినీచ మానవులుగ దలంచుచున్నారో శునక సూకరాదులకన్న నెవ్వరిని హేయముగఁ జూచుచున్నారో అట్టి చండాలురు ధర్మసంస్థాపనదక్షులమని విఱ్ఱవీఁగుచు జగంబెల్ల శాసించు క్షత్రియులకు నీతి మత ధర్మంబుల నుపదేశింప గురువులై యున్నతస్థానము నలంకరించుట ముందురాబోవు జాతి భ్రష్ట మతభ్రంశ వర్ణసంకరా ద్యనేక దారుణరంగ సంకీర్ణ కలియుగవిషాదాంత మహానాటకంబునకు నాంది గా నెఱుంగుఁడు. ఓ దుర్యోధనా! అగ్రజుని యర్ధాంగి యగుటచే ఆమె నీకు మాతృసమాన. అట్టిసాధ్విని దుఃఖింపఁ జేయుట నీకు శ్రేయస్కరముకాదు. భారతీయుల గౌరవ మంతయు దేనిపై నాధారపడియున్నదో, భరతదేశలక్ష్మి కెయ్యది పెట్టని విభూషణమో, భారతీయుల యుత్తమలోక ప్రయాణముల కెయ్యది నిర్మింపని సోపానపంక్తియో అట్టి భారతనారీసౌశీల్యాపహరణం బగాధ దుఃఖగర్తావతరంబుగా నెఱుంగుము.

సౌబ—ద్రౌణీ! ఏమి నీ ధర్మోపన్యాస మతిమాత్రమైనదే. ద్రౌపది ఏకవస్త్ర? దానిందాకుట పాపమంటివి? తొలుత నయ్యది ఏకవస్త్రయైనఁగదా నీ వేమేమో మహానాటక మంటివే? దానికీ కృత్యము నాందిరూపమును వహించుట. అది యెట్లైనను సభకు రాకుండఁ దప్పించుకొనఁ బన్నిన కుతంత్ర మిది. ఇందుచే నామె ద్విగుణితమగు శిక్షకుం

భ్రాతురాలైనది. ఇట్టిదానిని సభ కీడ్చించిన దోసంబు లేదు. మానభంగ మొనరించినను బాపంబురాదు.

అశ్వ—"సర్వనాశాయ మాతుల" అను పూర్వోక్తి వ్యర్థ ప్రకల్పితముకాదు. అపమార్గగామియగు మేనల్లునకు బుద్ధి సెప్పకపోగా భవిష్యద్దారుణకర్మాచరణమునకు మార్గదర్శి వగుచుఁ బ్రోత్సహించుచున్నావు. ఓ దుర్యోధనా! ఓ దుర్యోధనా! ఏనాఁటికైనఁ గురువంశ క్షయకారకుఁడీ సౌబలుఁడే యని త్రికరణశుద్ధిగ నమ్ముము. ఇట్టి కుల ద్రోహులు దేశద్రోహులు గల దుష్పరిషణ్మధ్యంబున న్యాయశీలురు, ధర్మమార్గానుయాయులు క్షణకాలమైన నిలువఁదగదు. ఛీ! (క్రూరముగఁ జూచుచు నిష్క్రమించుచున్నాఁడు.)

సౌబ—(జనాంతికము.) దుర్యోధనా! ఒక పీడ వదలినది.

(తెరలో) ఓ ఆర్తరక్షకులారా! శరణాగత రక్షణ బిరుదాంకితులారా! ఈ దుశ్శాసన హతకునిచే వేణిబట్టి యీడ్వబడుచున్నదానను, రక్షింపుడు రక్షింపుడు.

భీము—ఏమీ! పాండుభూపాలచూడామణిపెద్దకోడలు, అన్యజన దుర్నిరీక్ష్య పరమపాతివ్రత్యాభిశోభిత, జగద్భయంకరోదగ్రగజాగదుగ్రప్రతాపప్రభావిభాసిత దోరంతరాళులగు పాండవేయుల కర్ధాంగలక్ష్మి — దురాత్ముఁడు,

మానవాధముఁడు, దుర్మాదాంధుఁడు నగు దుశ్శాసన హతకునిచే వేణిబట్టి సభాంతరాళమున కీడ్వఁబడుట యా? త్రిజగద్భయావహ మహాప్రతాపానలప్రభానిరాకృత ప్రళయకాల మధ్యందినమార్తాండమండలుం డగు భీమసేనుని కంఠనాళములఁ బ్రాణసమీరప్రచార ముండఁగనే? (గదతో సంరంభించి సభ కలయం జూచి ధర్మజునిఁగాంచి) ఔరా! ధర్మజుని యుదాసీనత ఎన్నివిధముల భీమసేనుని ప్రాణములం దీయుచున్నది? (దుశ్శాసనుఁడు వేణిఁబట్టి యీడ్చుచుండ ద్రౌపది రంగముం బ్రవేశించుచున్నది.)

ద్రౌప—ఓ సభాసదులారా! పుణ్యపురుషులారా! రాజసూయావబృథంబున వసుధామర మంత్రపవిత్రవారిధారాభిషేచనమున పరమపావనము లైన నా శిరోజములం డెమల్చి యీ దుశ్శాసనహతకుఁ డీ తీఱున సభకీడ్చి తేనగునా? ఇందరు కురుముఖ్యుల సమక్షమున, ఇందరు పెద్దల యెట్టయెదుట నిది యనుచితమని తలంపక పాపకర్మమని చింతింపక, సర్వకులనాశకరమని విచారింపక పాండవేయార్ధాంగలక్ష్మినగు నన్ను, వీరసోదరినగు నన్ను, శుద్ధాంతకాంతనగు నన్ను, ఏకవస్త్రనగు నన్ను, యీ రీతి నవమానించునా? జగత్త్రియ భుజవీర్య సనాథులగు నాథులఁ గలిగియుండియు నభిమానపతియగు పాండవపట్ట మహిషి యనాథవిధంబున శాత్రవరాజ పరివేష్టితంబగు

సభాస్థానంబున నిట్లవమానితయై విలపింపవలసిన గతి పట్టెనా ! (దుఃఖించును.)

భీము—హా ! దుర్భరము, దుర్భరము. (పండ్లుకొఱుకుచు) రే గాంధారీగర్భభారభూతా ! దుశ్శాసనహతకా !

కృపు—నాయనా ! భీమసేనా ! సమయముకాదు. శాంతింపుము. (దుశ్శాసనుఁడు మీసము ద్రిప్పుచున్నాఁడు)

భీము—ఓరీ ! కురుకులపాంసనా ! ఇప్పటికి నీచావు తప్పినదని మిట్టిపడకుము. ఇందఱు సభాసదుల సమక్షంబునం బాండవ పట్టమహిషి నిట్లవమానించిన నిన్ను భీషణ సంగ్రామరంగంబున నీయగ్రజుని ప్రత్యక్షమున (గదను జూపుచు) ఈ గదాఘాతమున నీపేరురము వ్రక్కలించి లోకభీకరముగ నీరుధిరమును గ్రోలి నీప్రేవులు పుష్పమాలికల విధంబున కంఠమున కలంకరించికొందు. ఓ సభాస్తారులారా ! ఓ దుర్యోధనా ! ఓ జగచ్చక్షూ ! ఇదియే నా ప్రతిన. ఇందుకుందప్పిన పితృపితామహుల గతులకుం దప్పినవాఁడ నగుదును.

విదు—దుర్యోధనా ! వినుచున్నాఁడవుగదా మహాబల పుత్రుని భీషణప్రతిజ్ఞ?

దుర్యో—భార్యాపరాభవ సంజనిత సంతాపమునఁ గడుపు మండి కూయు నా భీముని కూతలును, మద్విజయాసహి

ష్ణుత్వమునఁ బ్రభువంచనాపరుండవై కూయు నీకూతలును నెవ్వఁడు లక్ష్యము సేయును?

విదు—నీ మేలుగోరిన నేను ప్రభువంచనాపరుండనా? వినోదవ్యాజమున ధర్మజుని వంచించిన నీవు పరశ్రేయోభిలాషివో! అట్లయినఁ దలంపరాని యవమానమున వగచెడి దుఃఖించు నీ మానవతీమణిసాధ్వీత్వమును నిలువఁబెట్టవలెఁగదా! అటు లొనరింపుము.

దుర్యో—తొలుత నది సాధ్వియైనఁగదా సభకెక్క ప్రేలు దుర్జాతి. పంచభర్తృక. త్రపావిహీన. ఇట్టిదానిని సభకీడ్పించిన నేమి? వస్త్రాపహరణమున సన్మానించిననేమి?

విదు—ఆ. ఈచేత చాలక వస్త్రాపహరణమునఁగూడ సన్మానింపఁ దలంచితివా ఆ పతివ్రతాతిలకమును? ఇదంతయు నీ యధఃపతనహేతువేసుమా!

దుర్యో—ఉత్తమపదారోహణ హేతువెయ్యది?

విదు—దయాసత్యశౌచములు. నిరంతర దీనరక్షణము, అహింస మున్నగు నివియే ఉత్తమపదారోహణ మార్గములు. సర్వజనాకర్షణ కృత్యములు.

దుర్యో—ఓహో! పాండవరక్షణోద్యమమున కక్కఱకు వచ్చిన వన్నియు రాజధర్మములు, సర్వజనాకర్షకములు నగునా? ప్రభువుల ధర్మాధర్మ న్యాయాన్యాయప్రవర్త

నాదికము, దైనందిన రాజ్యాభివృద్ధి, పరిపాలనా వైదగ్ధ్యము, ప్రజాభ్యుదయము సామంత సౌమనస్యమునుంబట్టి తెలిసికొనఁ దగినవిగాని నిన్నుబోలిన ఒకరిద్దరు విరోధుల యభిప్రాయానుసారము కాదు.

దుశ్శా—ఓయీ విదురా! నీకు చెడుకాలము కలిమి సార్వభౌమునిపై నీర్ష్యచే నిట్లంటివిగాక. ఈ మహామహుని వంటి పాలకుఁడు లేఁడు. ఈ విశ్వంభరాభరణునివంటి సామ్రాజ్యాభివృద్ధికరుఁడు లేఁడు. ఈ సార్వభౌముని ప్రభుత్వశిల్పమే భవిష్యత్ప్రభువర్యుల కాదర్శము కాఁదగినది.

విదు—ఆహా! ఏమి స్వోత్కర్షము? ఏమిభ్రాతృభక్తి? ఓయీ వెఱ్ఱివాఁడా! ఇది ప్రకృతము జరుగుచున్న యకృత్యవిషయికచర్చగాని పరిపాలనవిషయముకాదు. ఓ యనార్యుండా! ఈ రాజ్యములు గీజ్యములు శాశ్వతములనియా నీభ్రమ? పాండవసామ్రాజ్యము యీ శకునికైతవమున మీయన్నచే నెంతలో నొడిచికొనఁబడినది? అట్లే కాల వైపరీత్యమునఁ గౌరవసామ్రాజ్యమును బరధరాధిపతుల కరగతంబగును. తుచ్ఛంబులగు నీ సామ్రాజ్యంబులేమి! యుగంబులంతరించుటలేదా? ఈ భోగభాగ్యము లెల్ల జంచలములనియు నశ్వరములనియుఁ దెలిసికొనిన ఘాతఁడే మహాజ్ఞాని.

దుర్యో—నీవు చెప్పెడు జ్ఞాని వేఱు, ప్రభువు వేఱు. వారికి శాంతి వైరాగ్యములు, వీరికిఁ గామక్రోధములు. వారు కేవల సత్త్వగుణప్రధానులు, వీరు రాజస ప్రధానులు. వారనుసరించునది లోకధర్మము, వీరనుసరించునది క్షత్రియ ధర్మము. జ్ఞానిలోకధర్మమునకును, క్షత్రియ ధర్మమునకును నెచ్చట నే విధమైన సంబంధమును లేదు. క్షాత్రము శాత్రవులయెడ దయాదాక్షిణ్య ధర్మాధర్మ పాపపుణ్యములను బరిగణింపదు.

విదు—ఈ లోకమునఁ బరిగణింపఁబడకున్న మానె. పాపపుణ్య విచక్షణచేసి తత్తదుచిత దండనల విధింప నూర్ధ్వలోకమున దండధరుం డొకండు గలఁడని యైనఁ దలంతువా?

దుర్యో—స్వధర్మ నిర్వహణపారీణునకుఁ బాపపుణ్యము లెక్కడివి? ఉన్నను వానిని విచారించి దండింప దండధరుఁ డెవ్వఁడు? పోనిమ్ము, ఉండెననియే తలంతుము. ఆ యముండు నన్నుమాత్రము దండించి యీ బంధకిని, నిన్ను బరమపుణ్యాత్ములని పూజించునా?

విదు—ఓ యవివేకీ! "ఆత్మవత్సర్వభూతాని" అను న్యాయమును నిన్నువంటి దుష్టులు వారని తలంచి సరిపెట్టుకొనకుము. వారు కృష్ణప్రభావ పరిరక్షితులు. దేవతాంశా సంజనితు లగుటచే వారికి దేవత్వమును గలదు.

దుర్యో—(నవ్వుచు) నేను దేవత్వము నపేక్షింపను. నన్ను దేవతాంశము పరిరక్షింప నక్కఱలేదు. (తిరస్కార

భావముతో) కృష్ణుఁడట. భగవంతుఁడట. ఆతనిచే వీరు పరిరక్షితులట. కృష్ణపరిరక్షితులచేఁ బరిరక్షితుం డీతఁడట. కాననే అంధపరంపరాన్యాయమున మీ గతు లింతకు వచ్చినవి. (హేళనముగ) మీ రెల్లరుఁ గృష్ణ పరిరక్షితులైన లోకము తల్లక్రిందులగుననియా నీ యాశయము! ఆ కృష్ణుఁడు భగవంతుఁడా! అధమజాతిస్త్రీ పరిత్యక్త మలినాంబరధారణావిచ్ఛిన్నోత్తమాంగుఁడు వాఁడు. సంతత సామంతరాజన్యోత్తమాంగ సంశోభిత కోటీర సంస్థాపిత దివ్యరత్నప్రభా పరిభాసితాంఘ్రియుగళుండను నేను. సంతత గోపాలనాధురీణుడు వాఁడు. అనేక శత సహస్ర గోపాలక పరిపాలనాధురంధర భూపాలకపాలకుఁడను నేను. ఇప్పు డేమనియెదవు? భగవంతుఁ డాతఁడా! నేనా? "నావిష్ణుఃపృథివీపతిః" అను న్యాయానుసారముగ చక్రవర్తినగు నాకన్న నీమానవలోకమునకు భగవంతుఁడులేఁడు. నా శాసనముకన్న వేఱు ధర్మంబులేదు. మానవలోకమునకు దుర్యోధనసార్వభౌముఁడే దైవము. ఇంక నోరెత్తకుము.

విదు—ఓరీ! క్రూరా! నీచాతినీచహృదయా! సకల జగత్పూజ్యుండును, దుష్టసంహార శిష్టరక్షణార్థ మీ భువి నవతరించిన లీలామానుషవిగ్రహుఁ డగు శ్రీకృష్ణ పరమాత్మను దూషించిన మహాపాతకివి. నీ పాపమునకుఁ గడయనునది లేదు. నీ ముఖదర్శనము మహాపాతక

హేతువు. ఓరీ దుర్మదాంధా! ఎన్నటికైన నీ పాండవ సంతాపమే నీ హృదయశల్యముగ నెఱుంగుము. ఎన్నఁటికైన నీ క్రూర దుశ్శాసన హస్తాపకర్షిత పాండవపట్టమహిషీ పవిత్ర కేశపాశమే మీకంఠములం జుట్టుకొని మీ యుసురులను దీయు మహాకాలపాశమని తలంపుము. లేదు, సందేహము లేదు.

(క్రూరముగఁ జూచుచు నిష్క్రమించుచున్నాఁడు.)

ద్రౌ—ఓ మహామహులారా!

దుశ్శా—ఓ బంధకీ! ఏటి కిట్లూరక వాపోయెదవు?

మ॥ తరుణీ! యేటికి మాటిమాటికిఁ గృశత్వంబూని వాపోయెదే। వురు దౌర్భాగ్యుల మానహీనుల భృశంబుఙ్ గొల్చు కంటెఙ్ గదా । కరునిఙ్ మానధనాఢ్యు భూవలయ రక్షాదక్షు రాజన్యునో। క్కరునిఙ్ గోరి వరించి యావత శిఖాకల్పంబు గారాదొకో?

దుర్యో—(కనుసన్న చే ద్రౌపదిని తన యూరువు నధిరోహింప సూచించుచున్నాఁడు.)

భీము—(చూచి) పాపిష్ఠా! దుర్యోధనా! దుర్వారవైరిరాడ్గర్వనిర్వాపణ ప్రచండగదాదండపాండిత్య శౌండ భుజాదండుం డగు నీ భీమహర్యక్షకిశోరసమక్షంబున సాధ్వసహీనుండవై పాండవపట్టమహిషిని కనుసన్న చే నీ యూరుప్రదేశారోహణ మొనరింపఁ గోరుచున్నావా?

పాండవధర్మపత్ని నీవిధంబున రచ్చపట్టున నవమానించి యింకను ప్రాణములతో నిలుపోపసమకట్టితివా?

(గదతో సంరంభించును. కృపుఁడులేచి అడ్డుపడి)

కృపు—నాయనా! భీమసేనా! సమయము కాదు.

భీము—రే, దుర్యోధనా! పాండవధర్మపత్ని నధిరోహింప నేయూరువు నీవు చూపితివో నాయూరువు నా యుత్సంగము. నా యంకపాళిని భీషణసంగ్రామరంగంబున (గద చూపుచు) నీ గదాఘాతంబునఁ బొడిచేసెద. నామరూప విరహిత మొనర్చెద. ఇదియే నా ద్వితీయ ప్రతిజ్ఞ. (ద్రౌపదినిఁజూచుచు) ఓ పాండవ పట్టమహిషీ! చింత నీగుము. ఈ భీమహర్యక్షము ధర్మజాజ్ఞానిగళబద్ధంబై యూరకుండెఁగాని పౌరుషహీనమైకాదు. ఓ ద్రుపదపుత్రీ! ఇప్పట్టున ధర్మరక్షకుండును దుర్మతధ్వంసకుండునైన జనార్దనుండే నీకు శరణమయ్యెడుగాక.

మ. రమణీ! యూరటనొందుమీ చటులసం
గ్రామంబునన్ పీంద్రడ దు
ర్దమసత్వంబునఁజెండితద్రుధిరధా
రాతైలమున్ రాచినే
మమునం జిక్కెడలింతు నీకురులఁ బ్రే
మంబార లేకున్నఁ ద
ధ్యముగా జీవములూడ్తు దారుణ
శిఖి, వ్యావర్తజ్వాలాచ్ఛటన్.

ఊరడిల్లుము.

దుర్యో—ఓరీ! భీమహతకా! ఇంక నోరెత్తిన నిన్ను నైచు

వారము కాము. సోదరా! వీరల నాయుధవర్మవరూధం బులుదీయించి సేవకోచితవేషులం గావింపుము.

దుశ్శా—అట్లే. (పాండవుల నొక్కరొక్కరిని దీసికొనిపోయి సేవకోచితవేషులను గావించి తీసికొనివచ్చుచున్నాఁడు.)

ద్రౌ—నన్నును ఈ దురాత్మునిం డిట్లు చేయించునుగాఁబోలు. నే నీ మహాపదనుండి యెట్లు దరియింపంజాలుదు ? (ప్ర) ఓ దుర్యోధనా ! నిరుపమానాభిజాత్య గౌరవోపేతమగు కురువంశంబున జనించిన నీకు అబలల హింసించుట పురుషార్థమా ? నిష్కారణముగఁ బరసతీమణిం బట్టి పల్లార్చిన నీ వెంతటి ఘోరదుర్గతికిఁ బాలయ్యెదవో సుంత యోజింపుము.

దుర్యో—(సంపూర్ణక్రోధము వెల్లివిరియుచుండ తీక్ష్ణముగఁ జూచుచు) ఓసీ ! బంధకీ ! మయసభామధ్యంబున దుర్యోధనసార్వభౌముని సిగ్గువీడి హిహిహి, హహహ అని పరిహసించినట్లున్నదా యిప్పుడు? ఆ వికవికలు పకపకలు ఎక్కడకు పోయినవి? (ద్రౌపది నిర్విణ్ణయైన దృష్టితో చకితయగును.) ఒడలు తెలియక చేసిన యపరాధమునకుఁ దగిన శిక్ష యనుభవింపవలసినదే. అనుభవింపుము. ఇంక నోరెత్తిన నీ మానముతోఁబాటు ప్రాణములను గూడ నీ సుయోధనసార్వభౌముఁడు హరింపక తీఱఁడని యెఱుంగుము.

సౌబ—(స్వ) ఓరీ పిడుగా ! ఇదియా నీ క్రోధకారణము? (విభ్రాంతితో జూచును.)

ద్రౌ—మయసభామధ్యంబున నిన్ను నేను బరిహసించితినా? ఇదే మన్యాయము? ఇదియా నన్నిప్పు డీ సభ కీడ్పించుటకుఁ గారణము? ఓ దుర్యోధనా! నిజముగ నీయెడ నే నెట్టి ద్రోహమును దలపెట్టినదానను గాను. ఇందుకు నా యంతఃపురముసాక్షి పరమాత్మసాక్షి. ముమ్మాటికి నిక్కము నన్ను విడువుము.

దుర్యో—(క్రోధము గల దీర్ఘనిశ్వాసముతో) అంతఃపురము (తలయూచుచు) నీ వస్త్రములను దప్పక విడిపించియే తీఱుదును. నీ బయకారివర్తనా లింకను సాగివచ్చు నను కొంటివా?

కృప—నాయనా! దుర్యోధనా! న్యాయముగనో అన్యాయముగనో పాండవులు నీకు ద్యూతదాసులైరి. కాని సాధ్వీమతల్లియగు నీయమ నిట్లు నిండుసభామధ్యంబున నవమానింపఁ బూనుట స్త్రీజాతినే యవమానించుట యగుట నిశ్చయము. ఈ చైదమున భవిష్యత్తున నీ వంశమే పాటుపడనున్నదో కొంచెము సింహావలోకన మొనర్చి కొమ్ము.

మ॥ కుతుకంబాఱఁగ పేర్ప్రతిష్ఠ లెసఁగ కొన్నాళ్లు లీ భూమిపై
బ్రతు కాశించినవాఁడవేని విను మి ప్పాండుక్ష్మానాథసం
తతితో మాత్రము లేనిపోని పగఁబూ నంభోకు మొండైన మా

నిత మహా నీకులమెల్ల ధూళిపటమహా
విక్రాంబు మువమ్రాటికిఁ.

ఇదియే నా యంతిమోపదేశము. ఇంక మే మిచ్చట నిలువరాదు. (నిష్క్రమించుచున్నాఁడు.)

ద్రౌప—అక్కటా! నా కింకేది దిక్కు. అగ్నిసాక్షిగ పాణిగ్రహణ మొనరించి విశ్వవిశ్వంభరాభరణైకదక్షులై దీపించు నా ప్రాణనాథులే విధివశంబున నా యాపదం దప్పింపఁజాలనప్పు డింకను న న్నీ భూతలంబునం గాపాడఁ గలవా రెవ్వరు? ఓ దైవమా! నను గటాక్షింపుము. నిరంతర దీనజనపరిపాలన బిరుదాంకితుఁడగుజగన్నాథుఁడే యింక నాకు శరణ్యమయ్యెడుగాక. ఓ పరమాత్మా! ఆర్తత్రాణపరాయణా! అకారణజాతదయామయా! ఆపదుద్ధారకా! దీనబంధూ! మాం పాహి. మాం రక్ష. జగదీశ్వరా! నీ చరణరాజీవంబుల నాశ్రయించితి. నీకు శరణాగతనైతి. న న్నేరీతి నుద్ధరింతువో నీవే దిక్కు! మహానుభావా శ్రీకృష్ణా!

సీ॥ ఇదిగదా వేళ దీనదయాపరత్వంబు
వెల్లుగా నవనిలో వెల్లడింప
ఇదిగదా యదను సమ్మోదమార విద్వేష
ఘోర దుర్ధాష్ట్యసంహారమునకు
ఇదిగదా సమయమో సదయాత్మ! శరణాగ
తత్రాణబిరుదు సార్థకముసేయ
నిదిగదా కాలమాపద నొంది విలపించు
సతిసతీత్వ నిరూఘణత నొనర్ప

ఇదిగదా తరి తావకీ నేష్టబంధు
సోదరీమానరక్షణామోదకలనఁ
దృప్తినొందఁగ నీకు నో దీనపోష
వర దయాకర! యదుకులాభరణ! కృష్ణ!

(చేతులెత్తి నమస్కరించుచు నిమీలితనేత్రయై యుండును.)

దుర్యో—సోదరా! స్వేచ్ఛగ సభకెక్కె ద్రేలు నీ దుర్జాతిని విగతవస్త్రం గావింపుము. (శకుని దుర్యోధనులు దక్కఁ కడమ యెల్ల రవనతవదను లగుదురు.

దుశ్శా—(చిత్తము.) ధ్యానమగ్నయైయున్న ద్రౌపదిచీర చెరగు పట్టి లాగుచున్నాఁడు.)

దుర్యో—(జనాంతికము) ఏమూ! సోదరుం డలయుచున్నాఁడు. దీనికోక లిసుకపాతరవలెఁ దరుగకున్నవి.

శకుని—ఇది పరమాద్భుతముగ నున్నదే!

దుర్యో—ఇదిగాకున్న నింకొక మార్గము లేకుండునా ఈ చండాలిని వంచించుటకు?

(తెరలో)సత్యలోకపర్యంతవ్యాపిత యశఃకీర్తిసంభాసురా! బహుపరాక్

అతులిత విమలచరితాకృష్యమాణ నిఖిలభూచక్రా! బహుపరాక్.

శ్రీ శ్రీ శ్రీ ధృతరాష్ట్రసార్వభౌమా! బహుపరాక్,

దుర్యో—(జనాంతికము) ఈ విదురహతకుఁడు వోయి జనకునిం దోడ్కొనివచ్చుచున్నాఁడు. కానిమ్ము. మరియొక యుపాయమునన్నైన యీ బంధకిని వంచించి తీఱెద. (ప్ర) తమ్ముఁడా, మాతులా! పోవుదమురండు. (నిష్క్రమించుచున్నారు. వేఱొకవైపునుండి విదురుఁడు చేయిపట్టి కొనిరా ధృతరాష్ట్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ధృత—ఓరీ! దుర్యోధనా!

విదు—(చూచి) ఇంకను నెందులకు మహాప్రభూ! చేయఁదలఁచిన పని చేసియే తీఱెను.

ధృత—(ఆతురముతో) ఏమిచేసెను?

విదు—ద్రౌపదీవస్త్రాపహరణము.

ధృత—(సంభ్రమముతో) ఆ. ఆ. ఏమీ? ఓరీ, దుర్మతీ! ఎంతపనిచేసితివిరా?

విదు—(కలయఁజూచి) ఈ వస్త్రముల ప్రోవేమి? ఓహో! ఆశ్రితరక్షణ దీక్షాపరతంత్రుఁడగు కాంచనాంబరధరుండీ సాధ్వీమతల్లి కక్షయవస్త్రదానముచే మానసంరక్షణ మొనరించియుండనోపు. (నమస్కరించుచు కన్నులు మూసికొని) మహానుభావా! శ్రీకృష్ణా! ఏమి నీ భక్తపరాధీనత!

ధృత—ఆ. ఏమీ! విదురా! (ఆశ్చర్య భయసంభ్రమములతో) అమ్మా! ద్రుపద భూపాలపుత్రీ! దుఃఖింపకుము. నీ ప్రభావ మెఱుంగక యీ మతిహీనుఁ డిట్టి యమానుష

కృత్యము గావించె. తల్లీ! నీవు భరతకులాలంకారిణివి. నన్నును మాననీయయగు గాంధారింజూచియైన వారల రక్షించి యీ కురుకులంబు నుద్ధరింపుము. (ద్రౌ. దుఃఖించును.) దుఃఖింపకు మమ్మా! దుఃఖింపకుము. నీ ప్రాణనాథులతో నీరాజ్యవైభవాదులతో ఇంద్రప్రస్థమున కేగి యథాపూర్వము సుఖింపుము తల్లీ! సుఖింపుము. పరమ సాధ్వీమణి వగు నిన్ను దేవతలు రక్షించెదరుగాక. నాయనా! ధర్మనందనా! విచారింపకుము. ఆ దుర్మదాంధుని దుష్టచర్యలు నీకుఁ గ్రొత్తలు కావుగదా? ఇది మీ యెడ భరింపరాని మహాపరాధమే. కుమారులారా! భీమార్జున నకుల సహదేవులారా! శాంతిని వహింపుఁడు. లోకోత్తరమగు మీ భ్రాతృభక్తియే, మీ ధర్మనిష్ఠయే మిమ్ముల నుద్ధరించును. మీకు శుభంబగుఁగాక.

## భరత వాక్యము

గీ. ధర్మము స్వయంప్రకాశ్యమై తనరుగాక
కవికుమారులు సంతృప్తిఁగంద్రుగాక
ఆయురారోగ్య భోగభాగ్యములు గల్గి
సర్వవర్ణాశ్రమములు శాశ్వతములగుత!

గీ. హారితుఁడు మక్కపాటి మహాన్వయుండు
ప్రథిత వేంకటరత్న విరచితమైన
ద్రౌపదీదేవిమానసంరక్షణంబు వి[illegible]
పృథ్వి సర్వంకషవ్యాప్తి నెనయుఁగాక

ఓమ్ తత్సత్.

# శుద్ధపత్రము



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 8 | నీకే మొద | నీకే. నీవువచ్చినది మొద |
| 4 | 7 | అపరదుర్వాసావతారమ | అపరదుర్వాసోవతారము |
| ,, | 23 | యధార్థసంభావనలతో | యధార్థసంభావనలతో |
| 12 | 15 | శ్రీకృష్ణపరమాత్మయొక్క | శ్రీకృష్ణపరమాత్మ |
| 14 | 9 | రంజ్యమారా | రంజ్యమాణ |
| 26 | 4 | యుక్తాయుక్తజ్ఞానము | యుక్తాయుక్తవివేచనాజ్ఞానము |
| 26 | 20 | చక్రవర్తికార్యము | చక్రవర్తిక్రార్యము |
| 34 | 9 | మయమార్గప్రవర్తకు | మనుమార్గప్రవర్తకు |
| 55 | 8 | దక్షిణపువైపున గళ్లకు | దక్షిణపువైపున నగళ్లకు |
| 58 | 12 | హాోలావిలాస | హేలావిలాస |
| 60 | 3 | యుత్పాదమునకు | యుత్పాతమునకు |